mohan PUBLICATIONS
Granthanidhi.blogspot.in
ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్
FB@mohanpublications
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట, రాజమహేంద్రవరం - 533 101.
Mohanpublications.com
SUNDAY SPECIAL MAGAZINES
గ్రంథనిధి

వార్త
ఆదివారం
28 మే 2017

# రికార్డుల బాహుబలి!

## మలుపు తిరిగిన తెలుగు సినిమా..

# తారాతీరం



## ట్రెడిషనల్‌గా కన్పిస్తా

ఇంతకుముందు చేసిన వాటిలో ఎక్కువగా మోడ్రన్ అమ్మాయిగానే కనబడ్డాను.. కానీ ఇపుడు రారండోయ్ వేడుక చూద్దాం... సినిమాలో పూర్తి విలేజ్ గర్ల్‌గా కనబడతాను.. ఎక్కువ శారీలు కట్టుకుని ట్రెడిషనల్‌గా ఉంటా. అన్నట్టు చైతన్యను చూసి చాలా మంది అబ్బాయిలు నేర్చుకోవాలి.. అక్కినేని లాంటి గొప్ప ఫ్యామిలీలో పుట్టి కూడ చాలా సింపుల్‌గా ఉంటారు.. రారండోయ్.. సినిమా షూటింగ్‌లో ఉన్నపుడు మా ఫ్యామిలీ వాళ్లెవ్వరూ గుర్తుకు రాలేదు. సినిమాలో చేసిన వాళ్లంతా నాకు చాలా దగ్గరయ్యారు. వాళ్లతో ఉంటే నా ఫ్యామిలీతో ఉన్నట్టే ఉంటుంది... అంటూ స్టార్ హీరోయిన్ రకుల్‌ప్రీత్ సింగ్ ఇటీవల చెప్పుకొచ్చింది.



## రొమాంటిక్ మూడ్

మెగా ఫ్యామిలీ నుంచి వచ్చినా తనకంటూ గుర్తింపు సంపాదించేసుకున్నారు సాయిధరమ్‌తేజ్.. బివిఎస్ రవి దర్శకత్వంలో జవాన్ చిత్రంలో నటిస్తున్న ఆయన ఖచ్చితంగా సక్సెస్ సాధిస్తాననే ధీమాతో ఉన్నారు.. యాక్షన్‌తోపాటు ఫన్ ఎలిమెంట్స్.. వీటన్నిటి చుట్టూ అల్లుకున్న ప్రేమ కథ.. మెగా హీరోకు కరుణాకరన్ చెప్పిన స్టోరీలైన్ నచ్చటంతో గ్రీన్ సిగ్నల్ ఇచ్చేశారు.



## కేన్స్‌లో షాక్!



సోషల్ మీడియాలో ఫ్రెండ్ అయిన వ్యక్తి ఎక్కడో అనుకోకుండా నేరుగా ఎదురుపడి పలకరిస్తే కలిగే ఎగ్జైట్‌మెంట్ వేరుగా ఉంటుంది. సామాన్యులకే కాదు.. సెలబ్రిటీలకు కూడ ఇలాంటి అనుభవాలు ఎదురవుతుంటాయి. వేరే దేశానికి చెందిన వ్యక్తి మరేదో దేశంలో ఇలా ఎదురుపడితే ఎవ్వరైనా ఎగ్జైట్ అవ్వాల్సిందే. స్టార్ హీరోయిన్ శ్రుతిహాసన్‌కు కూడ ఇలాంటి అనుభవమే ఎదురైంది.. శ్రుతికి ఆంగ్ల రచయిత నెయిల్ గైమెన్ అంటే అభిమానం.. ఆయనతో ట్విట్టర్ ద్వారా ఫాలోయర్‌గా మారడమే కాదు ఆయనతో పరిచయం చేసుకుని ఫ్రెండ్‌గా మారింది.. అయితే తాను కథానాయిక పాత్ర పోషిస్తున్న సంఘమిత్రకోసం కేన్స్ ఫిలిం ఫెస్టివల్‌కు వెళ్లి అక్కడ రెడ్ కార్పెట్ మీద సందడి చేసిన సంగతి తెలిసిందే.. అక్కడే ఆమెకు నెయిల్ గైమెన్ కన్పించాడు.. తాను ఫలానా అని మరోసారి పరిచయం చేసుకోగా.. నెయిల్ చాలా సంతోషించి ఆమెను తాను రచన చేసిన 'హౌటు టాక్ టు గర్ల్స్ ఎట్ పార్టీస్' అనే హాలీవుడ్ ప్రీమియర్ షోకు అతిథిగా ఆహ్వానం అందించాడు.. ఆయన ఆహ్వానాన్ని మన్నించి శ్రుతి అక్కడ కూడ సందడి చేసింది.. శ్రుతి బహుముఖ ప్రతిభ గురించి కేన్స్ వేదికగా నెయిల్ గైమెన్ తెగపొగిడేశాడు..

కె.లీలా సువర్ణ

An ISO 9001 - 2000 Certified ®




# పాజిటివ్ హోమియోపతి

www.drpositive.in

## మీట్ యువర్ డాక్టర్

ఆరోగ్య సేవలో 12 సం॥ల అనుభవం

కాన్స్టిట్యూషనల్ పద్ధతి ద్వారా చికిత్స

కనీసం 40 ని॥లు పేషేంట్ కోసం డాక్టర్ల కేటాయింపు

వెయిటింగ్ లేని డాక్టర్ అపాయింట్మెంట్



డయాబెటిస్.. హోమియోతో చక్కని పరిష్కారం

diabetic cell

కిడ్నీలో రాళ్ళ సమస్యలా?

పాజిటివ్‌లో చక్కని పరిష్కారం





మాతృత్వం ఒక వరం

చేసుకోండి దాన్ని సఫలం

సంతానలేమికి చక్కటి పరిష్కారం

నొప్పి లేని జీవితానికి సుస్వాగతం

Positive Orthopathy

మెడ నొప్పి, నడుం, కీళ్ళ నొప్పులు





థైరాయిడ్ బారినుండి విముక్తి !

ThyroCell

PCOD, సంతాన లేమి, అధిక బరువు

పైల్స్‌తో బాధ? హోమియోతో పరిష్కారం

పైల్స్, ఫిస్టులా & ఫిషర్





శ్వాస సంబంధిత సమస్యల నుండి విముక్తి !

Anti Allergy CLINIC

తుమ్ములు, ఆస్తమా, సైనసైటిస్

పిల్లలలో మానసిక ఎదుగుదల సమస్యలకై చికిత్స

ఆటిజం, ఇకోలేరియా



డాక్టర్ కన్సల్టేషన్ ఉచితం. ఫోన్: 903-056-1177, TOLL FREE: 1800 108 1900

బేగంపేట | అమీర్‌పేట | జూబ్లిహిల్స్ | కొండాపూర్ | కూకట్‌పల్లి | విక్రమ్‌పురి | A.S.రావు నగర్
కాచిగూడ | దిల్‌సుఖ్‌నగర్ | మెహిదీపట్నం | నిజామాబాద్ | హన్మకొండ | కరీంనగర్ | ఖమ్మం | తమిళనాడు

ఆదివారం వార్త

28 మే 2017

## మంచి ముత్యాలు

వాడని ఇనుము తుప్పు పడుతుంది.
కదలని నీరు స్వచ్ఛతను కోల్పోతుంది.
బద్ధకం మెదడును నిస్తేజం చేస్తుంది.
-డావిన్సి

## విషయ విశేషం








## భావ వీచిక



### బడికోసం బాలలు!

బడి బాట పట్టండంటూ పల్లెల్లో బాలల్ని బళ్లల్లో చేర్పినా, అంతలోనే ఆ బాలల్లో చాలామంది బడిమానేసి చదువుకు దూరమవుతున్న సంగతి తెలిసింది. అయితే మరోవైపు దీనికి భిన్నమైన దృశ్యం ఇటీవల ఉత్తరాదిన కన్పించడం విశేషం. కొద్దిరోజుల కిందట హర్యానాలోని రెవారిలో పాఠశాల విద్యార్థినులు తమ స్కూలును హయ్యర్ సెకండరీ స్కూలు స్థాయికి పెంచవలసిందిగా 8రోజుల పాటు నిరాహార దీక్ష చేసి, ప్రభుత్వం నుంచి హామీ అందుకుని విరమించారు. అది చూసి గుర్‌గావ్‌కు చెందిన కందర్పూర్ గ్రామ విద్యార్థులు కూడా తమ స్కూల్‌ను 12వ తరగతి స్థాయివరకు పెంచాలని డిమాండ్ చేశారు. తమ డిమాండ్ మూడేళ్లుగా ఉందని వారు వాపోయారు. పదోతరగతి చదివే 170 మంది అమ్మాయిలు స్కూలు గేటుకు తాళం వేసి బయట నిరసన మొదలుపెట్టారు. తాజాగా జింద్ లోని యాభైమంది విద్యార్థినులు ఇదే డిమాండ్‌తో నిరవధిక నిరాహార దీక్షకు పూనుకున్నారు. ప్రిన్సిపాల్‌ను, టీచర్లను స్కూల్లో ప్రవేశించకుండా గేటుకు తాళం వేశారట. ప్రభుత్వం తమ డిమాండ్ల విషయమై హామీ ఇచ్చేవరకు గేట్లు తీసేది లేదని సర్పంచ్ సైతం చెప్పారట. అయితే అక్కడి విద్యాశాఖాధికారి ప్రభుత్వానికి వారి డిమాండ్ విషయమై లేఖ రాస్తానని చెప్పారు. పాల్వల్‌లో అయితే ఇంకా చిత్రంగా తల్లిదండ్రులు కొంతమంది టీచర్లను స్కూలు భవనంలో ఉంచి తాళం వేసి ప్రైమరీ స్కూలును మాధ్యమిక పాఠశాలగా మార్చమని డిమాండ్ చేస్తున్నారట. ఇంతకూ స్కూలు టీచర్లు ఏంచేశారంటే..స్టాఫ్ తక్కువని, క్లాసులు రెగ్యులర్‌గా తీసుకోక పోవటం వల్ల తమ పిల్లలు చదువు నష్టపో తున్నారని తల్లిదండ్రులు వాపోయారు. జిల్లా విద్యాధికారి వారి డిమాండ్లను నెరవేరుస్తా మని మాట ఇచ్చారట.

ఏమైనా పిల్లల్లో, తల్లిదండ్రుల్లో విద్య పట్ల ఇంతగా చైతన్యం వెల్లివిరుస్తోందంటే ఆనందించవలసిన విషయమే. ఒక్క హర్యానా, గుర్‌గావ్‌లలోనే కాకుండా దేశమంతటా పల్లెల్లో చదువుపట్ల చైతన్యం ఏర్పడితే దేశమంతా విద్యాకుసుమాలు వికసించి, వివేక పరిమళం వ్యాపించటం ఖాయం.

## లేఖలు

### చైతన్యదాయకం..

మే 14 వార్త ఆదివారం అను బంధం లో అందించిన కవర్ స్టోరీ 'ఇసి పేరుకేనా...ఎన్నికల్లో ఇష్టా రాజ్యం' కవర్ స్టోరీ మనదేశంలోని ఎన్నికల వ్యవస్థను, సంబంధిత చట్టాలను, ఇసికి స్వయంప్రతిపత్తి ఉండవలసిన అవసరాన్ని వివరిం చి చైతన్యపరిచారు. మీకు మా ధన్యవాదాలు.

-జి.రామకృష్ణ, నల్గొండ; ఆర్.ధనుంజయ్, గుంటూరు; పి.మమత, కడప.

### సంచిక నచ్చింది

మే 14 వార్త ఆదివారం అనుబంధంలో మాతృదినోత్సవ సందర్భంగా ఇచ్చిన 'అమ్మ.. ఓవరం!' ఆర్టికల్ హృద్యంగా ఉంది. కవర్ స్టోరీలో ఇసి మారాల్సిన తీరును చక్కగా తెలియజేశారు. 'దొంగోడు' కథ నవ్వించింది, కదిలించింది.

-శివలెంక చంద్రశేఖర్, హైదరాబాద్.

### ఆర్టికల్స్ ఆకట్టుకున్నాయి

మే 14 వార్త ఆదివారం మేగజైన్‌లో రెండు వ్యాసాలు నన్ను ఆకట్టుకున్నాయి. ఇసి పేరుకే నా?..కవర్‌స్టోరీ మనదేశంలో ఎన్నికల తీరును చక్కగా విశ్లేషించింది. ఎన్నికలు సక్ర మంగా జరిగేందుకు సమగ్రచట్టాలను తీసుకు రావాల్సిన అవసరం ఉంది. ఇక మూడోకన్ను లో 'నిర్భయకు ముందు..తర్వాత' వ్యాసం ఎంతో బాగుంది. దేశంలో అత్యాచారాలు విచ్చలవిడి అయినందున నేరస్థులకు మరణశిక్ష సరైనదే.

-కైప నాగరాజు, అనంతపురం

### అలరించిన ఆదివారం సంచిక

మే 14 వార్త ఆదివారం మేగజైన్‌లో 'భావ వీచిక'లో బాలల ఆరోగ్యాన్ని దృష్టిలో పెట్టుకొని మహారాష్ట్రలో బడులలో జంక్‌ఫుడ్‌ను నిషేధిం చటం గురించిన ప్రస్తావన బాగుంది. 'సంఫీ' భావంలో చెప్పినట్లు పరిశుభ్రతలో ముందుండ టానికి మనం కూడా కృషిచేయాలి. అమ్మపై ప్రచురించిన కవితలు..ముఖ్యంగా 'ఆది గురువు అమ్మ' కవిత మనసును కదిలించింది. 'ఏమిటో ఈ బంధం' కథ బాగుంది.

-డా.శివభూషణం, కర్నూలు.

### అన్నీ మంచి అంశములే..

మే 14 వార్త సన్‌డే మేగజైన్‌లో భావవీచిక లో చెప్పినట్లు జంక్‌ఫుడ్‌ను బడులలో అంతటా నిషేధించాల్సిన అవసరం ఉంది. పరిశుభ్రతలో ఫస్ట్..గురించిన సంఫీభావం బాగుంది. ప్రజ ల్లో మార్పు వస్తేనే అది సాధ్యమవుతుంది. కవర్ స్టోరీ వాస్తవాలను ప్రతిబింబించింది. 'ఏమిటో..ఈ బంధం' కథాకర్త కావేరిపాకం రవిశేఖర్‌కు అభినందనలు. అమ్మ ప్రేమను అక్ష రీకరించిన కవితలు భావగర్భితంగా ఉన్నాయి. హిరణ్యకార్టూన్స్ నైస్. బ్యాక్ కవర్ ప్రకృతి పరచిన పూల తివాచీ' పరవశింపజేసింది.

-నేమాని సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం.

'సంఘీ'భావం

# జీవ వైవిధ్యంతోనే మానవ మనుగడ



తెలుగు రాష్ట్రాలతో పాటుగా దేశంలోని పలు ప్రాంతాలు మే నెలను అగ్నిగుండంగా మార్చాయి. ప్రజలను వేసవి ఎండలు కర్ఫ్యూలా మార్చి ఇంటికే పరిమితమయ్యేలా చేసాయి.

మండుటెండలతో మాడిపోతున్న జనంతోపాటు పాలకులు ఇప్పటికైనా మేల్కొని జీవ వైవిధ్యాన్ని పరిరక్షిస్తే మంచిది. ఈ మండుటెండలు ప్రజలకు, పాలకులకు అనేక పాఠాలను నేర్పాయి. కానీ ఈ పాఠాలనుంచి ప్రజలు, పాలకులు ఏమైనా నేర్చుకుంటారా? అనేదే ఇప్పుడు సందేహం. ఎండలు పోయి వానలు వచ్చి ఆహ్లాదకర పరిస్థితులు ఏర్పడితే జీవ వైవిధ్యం గురించి అంతా మర్చిపోతున్నారు. మళ్లీ వేసవి కాలంలో ఎండలు మండినపుడు మాత్రమే పచ్చదనం, అడవులు, జీవ వైవిధ్య పరిరక్షణ గురించి గుర్తుకు వస్తోంది. దీని ఫలితమే మనం ఈ మండుటెండల్లో మలమల మాడిపోవాల్సి వచ్చిందన్న విషయాన్ని గ్రహించటం లేదు. ప్రతి ఏటా జీవ వైవిధ్య వారోత్సవాలను నిర్వహించుకున్నట్లుగానే గడిచిన వారం కూడా ఓ తంతులా కార్యక్రమాలను నిర్వహించారు. కానీ ప్రజలకు, పాలకులకు జీవ వైవిధ్య పరిరక్షణే ప్రథమ ప్రాధాన్యమని గుర్తించకపోవడమే జీవ వైవిధ్యం పాలిట శాపంగా మారింది. మానవుని మనుగడకే, మానవాళికే జీవ వైవిధ్య వినాశనం ముప్పుగా పరిణమించింది. ఐక్యరాజ్యసమితి ప్రపంచంలోనే 17 జీవ వైవిధ్య దేశాలను శాస్త్రీయంగా గుర్తించింది. ఇందులో భారత్ కూడా ఒకటి.

భారతదేశంలో జీవ వైవిధ్యానికి కొరతలేదు. 47 వేల రకాల మొక్కలు, 90 వేల జంతువులు, 16 జీవ వైవిధ్య ప్రాంతాలున్నాయి. ప్రపంచంలో భారతదేశ విస్తీర్ణం 2.4 శాతం. కానీ జీవ వైవిధ్యం 8 నుంచి 10 శాతంగా ఉన్నది. సహజ వనరులకు కొరతే లేదు. కానీ అభివృద్ధి పేరిట జరుగుతున్న వినాశనమే మానవాళికి ముప్పు తెస్తున్నది. రోజు రోజుకు పెరిగే జనాభా, అడవుల నిర్మూలన, జల, వాయు కాలుష్యం, అభివృద్ధి పేరిట జరిగే విచక్షణా రహిత రోడ్లు, మైనింగ్ తవ్వకాలు, ప్రాజెక్టులు జీవ వైవిధ్యానికి తూట్లు పొడుస్తున్నాయి. చివరకు హిమాలయాలు, దట్టమైన అటవీ ప్రాంతాలు కూడా అభివృద్ధి పేరిట బలవుతున్నాయి. చెట్లు, జంతువులే కాకుండా అడవుల్నే నమ్ముకున్న గిరిజనులు కూడా జీవించే పరిస్థితి లేని ప్రమాదకర పరిస్థితులు నెలకొన్నాయి. అరుదైన వృక్ష, జంతుజాలం కూడా వేగంగా మానవుడికి స్వార్థానికి బలైపోతున్నది. భూమే కాకుండా కొండలు, పర్వతాలు, నదులు, వాగులు, వంకలు కూడా అభివృద్ధి పేరిట వేగంగా కనుమరుగైపోతున్నాయి. వీటిని పరిరక్షించడానికి బదులు భక్షించడానికే మానవ స్వార్థం కోరలు చాస్తోంది. భూమిని, భూమిపై ఉన్న జీవ జంతురాశులను కాపాడేవారే కరువయ్యారు. ప్రకృతి వినాశనం ఫలితాన్ని ఎండల రూపంలో సునామీ, తుఫాన్ల రూపంలో మానవాళి అంతులేని నష్టానికి గురవుతున్నా పాలకులకు జీవ వైవిధ్యంపట్ల శ్రద్ధ లేకుండా పోతున్నది. పర్యావరణాన్ని భూమిని రక్షించడానికి, అంతరించిపోతున్న జీవులను రక్షించడానికి అనేక దేశాలు చిత్తశుద్ధితో ప్రయత్నాలు చేస్తున్నాయి. స్వీడన్ పెట్రోల్‌కు గుడ్ బై చెప్పి సాంప్రదాయేతర ఇంధన వనరులను ప్రోత్సహిస్తున్నది. ఇండోనేషియా బెలారస్ అడవులను, వియత్నాం మెకాన్ డెల్టా భూములను, బెనిన్ తాబేళ్లను రక్షించడానికి ప్రయత్నాలు చేస్తున్నాయి. కానీ భారతదేశంలో మాత్రం అంతరించిపోయే వృక్ష జంతుజాలాన్ని రక్షించడానికి బదులు వేటు వేయడానికే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో ఎర్రచందనం స్మగ్లింగే ఇందుకు ప్రబల నిదర్శనంగా చెప్పుకోవచ్చు. సముద్రంలో మత్స్య సంపదను కాపాడుకోలేక పోతున్నాం. సముద్ర తీరాల్లో విలువైన ఖనిజాలను కాపాడుకోలేకపోతున్నాం. హిమాలయాలు క్రమంగా తమ సహజ స్వరూపాన్ని మార్చుకున్న దయనీయ పరిస్థితి ఏర్పడింది. అభివృద్ధిని ఎవరూ వ్యతిరేకించడం లేదు. దుబాయ్ లాంటి దేశం ఎడారిలో కూడా సంపదను సృష్టించడానికి కారణం అది పరిమితమైన వనరులను సద్వినియోగం చేసుకోవడమే. కానీ మనం మాత్రం అన్ని వనరులను దుర్వినియోగం చేస్తున్నాం. అభివృద్ధికి ఆటంకంగా ఉన్నాయనే కారణంతో అడవులను నరికివేస్తున్నాం. మైనింగ్‌కోసం అడవులను బలి ఇస్తున్నాం. దానికి ప్రత్యామ్నాయంగా చెట్లు నాటడం లేదు. అడవులను పెంచడం లేదు. ఫలితంగా మొత్తం భూమిపై పచ్చదనం క్రమంగా తగ్గిపోయి భూతాపం అసాధారణంగా పెరుగుతున్నది. ఈ సీజన్‌లో ఎండలు 50 డిగ్రీలకు చేరితేనే మనం వణికిపోతున్నాం. ప్రకృతిని, జీవ వైవిధ్యాన్ని నిర్లక్ష్యం చేసిన ఫలితాన్ని ఇప్పుడు అనుభవిస్తున్నాం. ఇది మరింత దారుణంగా మారే ప్రమాదం ఏర్పడింది. అడవులను, జంతువులను పరిరక్షించకుంటే జీవ వైవిధ్యాన్ని కాపాడకుంటే భూతాపం మరింత పెరిగి మానవుల జీవితాల్లో మంటలు రేపడం ఖాయం. ఇప్పుడు పలు ప్రాంతాల్లో ఎండల తాకిడికి కార్లే కాకుండా ద్విచక్ర వాహనాలు, ప్లాంట్లు తగలబడిపోతుండడం మనం చూస్తున్నాం. ఇది మరింత ప్రమాదకరంగా మారితే మానవాళి మనుగడే కష్టమని అంతా గ్రహిస్తే మంచిది. లేదంటే వినాశనాన్ని మనం కొనితెచ్చుకున్నట్లే.

జీవ వైవిధ్యాన్ని పరిరక్షించాలంటే ఇందులో పౌర సమాజాన్ని భాగస్వాములను చేయాలి. ప్రకృతికి నష్టం జరక్కుండా సుస్థిర అభివృద్ధి జరగడానికి సర్వ జన శ్రేయో విధానాలను పాలకులు రూపొందించాలి. గతం గతః, వర్తమానం ప్రమాదంలో ఉంది. భవిష్యత్తునైనా రక్షించుకోవడానికి పచ్చదనాన్ని పరిఢవిల్లేలా ప్రజా ఉద్యమం రావాలి. ఇంటినుంచే మొక్కలు నాటడం విధానంగా మారాలి. ప్రభుత్వాల అభివృద్ధి విధానాలు కూడా జీవ వైవిధ్యంతో ముడిపెట్టాలి. గ్రీన్ కట్టడాలు పెరగాలి. వీటికి ప్రభుత్వాలు ప్రోత్సాహాలు ఇవ్వాలి. తరిగిపోయే జల, థర్మల్ విద్యుత్ ఉత్పత్తులకు బదులు సౌర విద్యుత్తుకు అత్యధిక ప్రాధాన్యం ఇవ్వాలి. 365 రోజుల్లో 200కు పైగా రేడియేషన్ అంటే సూర్యరశ్మి ఉంటే అద్భుత అవకాశం భారత్‌కు ఉంది. దీన్ని సౌర విద్యుత్ ఉత్పత్తిగా మార్చడానికి సరికొత్త అవకాశాలు కల్పించాలి. చాలా చోట్ల నదులు, రోడ్లను సౌర ఫలకాలతో అనుసంధానం చేసి విద్యుత్‌ను ఉత్పత్తి చేస్తున్నారు. ఇండ్ల పైకప్పులపై సౌర ఫలకాలు ఉంచి, గృహ విద్యుత్ వినియోగాన్ని పెంపొందిస్తున్నారు. ఇదే తరహాలో వినూత్న జీవ వైవిధ్యాన్ని మరింతగా పెంచితే తప్ప మనుషులు భూమిపై జీవించే పరిస్థితి కనిపించడం లేదు.

– డాక్టర్ గిరీష్‌కుమార్ సంఘీ



# దారి తప్పిన దాయాది

- ఎ.వి.వి. ప్రసాద్

సబబు కానె కాదు జాదవ్‌కు ఉరిశిక్ష
పాక్ కుతంత్రమాయె బట్టబయలు;
తప్పు దారిపట్టె దాయాది దేశము
విశ్వవినుత నామ! వినురవేమ!!

**కుల్‌భూషణ్ జాదవ్ గూఢచారి అవునా, కాదా అనే ప్రశ్న కంటె అతడి విషయం ఇప్పుడు భారత్, పాక్‌ల బలాబలాల సమస్యగా మారుతున్నదేమో! అనే అనుమానం కలుగుతోంది. శిక్ష అమలుపై ఐసిజె ఇచ్చిన స్టేతో పాక్ దెబ్బతిన్న పులిలా మారుతుందనడంలో కూడా సందేహం లేదు. జాదవ్‌ను అడ్డుపెట్టుకొని ఉద్రిక్తతలు మరింతగా పెంచడం, ఏదో ఒక పాయింట్‌వద్ద ఆ ఉద్రిక్తతలను యుద్ధంగా మార్చడం పాక్ వ్యూహంగా కనిపిస్తోంది. జాదవ్‌పై చేసిన అభియోగాలకు ఒక్క ఆధారం కూడా బయట పెట్టలేకపోతున్న పాక్ కోర్టు విచారణలో గెలవడం కష్టమే అయినా, సమస్యను పక్కదారి పట్టించి చైనా మద్దతుతో భారత్‌పై తెగబడడానికి ప్రణాళికలు రూపొందించుకొంటున్నట్లుగా కూడా కనిపిస్తోంది. ఈ పరిస్థితిలో భారత్ అత్యంత జాగరూకతతో అడుగులు వేయవలసిన అవసరం ఉంది.**

కుల్‌భూషణ్ జాదవ్ విషయంలో పాక్, భారత్‌లలో గెలిచిందెవరు? పాక్ అతడికి విధించిన మరణశిక్ష అమలుపై అంతర్జాతీయ న్యాయస్థానం (ఐసిజె) స్టే ఇవ్వడంతో భారత్‌లో చాలా చోట్ల సంబరాలు జరుపుకొన్నారు గనుక విజయం భారత్‌దే అనే ప్రచారం జరిగింది. అది సంబరాలు జరుపుకొనేంత విజయమేమీ కాదు, కేసు కోర్టు విచారణలో ఉన్నది గనుక 'న్యాయవిధానం'లో భాగంగా స్టే లభించిందనీ, తుది తీర్పులో అసలు విజయం తమదేననీ పాక్ అంటోంది. నిజానికి రెండువాదనలూ సబబుగానే కనిపిస్తాయి. అతడికి విధించిన మరణశిక్ష సమంజసమైనదేనా? అని ప్రశ్నించుకొంటే లభించే సమాధానం వేరు. ఆ సమాధానం నుంచి అసలు విజేతను నిర్ణయించవలసి ఉంటుంది. కానీ కోర్టు విచారణ మధ్యలో ఉన్నప్పుడు లభించిన స్టే కనుక దానిలో జయాపజయాల సమస్య ఉత్పన్నంకాదు. తమ విజయంగా చెప్పుకొని భారత్‌లో కొన్ని పార్టీలు సంబరాలు జరుపుకోవడం వల్ల అది పాక్‌ను పరోక్షంగా మరింత రెచ్చగొట్టినట్లయిందిగాని జాదవ్‌ను ఉరికంబమెక్కకుండా ఎంతవరకు కాపాడగలదో చెప్పలేని పరిస్థితి ఏర్పడింది. స్టే అవసరం లేకుండా, పాక్ చర్యకు వ్యతిరేకంగా ఐసిజె తీర్పు లభించేలా భారత్ ప్రయత్నించి ఉంటే అది విజయంగా అంతా తప్పక భావించేవారు. కానీ జాదవ్ భవిష్యత్తు ఇప్పుడు మరింత ఆందోళనకరంగా తయారయినట్లు కనిపిస్తోంది.



గూఢచర్యానికి పాల్పడుతున్నాడనే ఆరోపణలపై భారత్ నావికాదళ మాజీ అధికారి అయిన కుల్‌భూషణ్ జాదవ్‌కు పాకిస్థాన్ సైనిక న్యాయ స్థానం మరణశిక్ష విధించింది. ఆ చర్య అక్రమమనీ, జాదవ్ శిక్షకు గురికాకుండా బయటపడే చర్యలు తీసుకోవాలనీ కోరుతూ మనదేశం ఐసిజెకు అప్పీలు చేసింది. ఏదైనా ఒకదేశం ఇలాంటి శిక్షలు విధించినపుడు దౌత్య పద్ధతి ద్వారా ఉన్న అన్ని అవకాశాలను వినియోగించుకోవడం జరుగుతుంది. జాదవ్‌పై వచ్చిన గూఢచర్యం ఆరోపణల్లోని 'గాఢత' ఎంత? అన్నది పరిశీలించవలసిన ఒక అంశమైతే, ఆ ఆరోపణలకు మరణశిక్ష విధించడంలోని ఔచిత్య మెంత? అనేది మరో అంశం. తొలుత ఈ రెండు అంశాలకు పాక్‌నుంచి సరైన సమాధానం దొరికితే సమస్య దౌత్య పద్ధతి ద్వారా తేలికగానే పరిష్కారమవుతుంది. కానీ భారత్-పాక్‌ల మధ్య ఏదైనా సమస్య వస్తే అది దౌత్య పద్ధతిలో పరిష్కారమయ్యే వాతావరణం ప్రస్తుతం లేదు గనుకనే కేసు అంతర్జాతీయ న్యాయస్థానం దాకా వెళ్లింది. అయితే అక్కడ తీర్పును ప్రభావితం చేయగల అంశాలు కూడా కొన్ని ఉంటాయి. ఇప్పుడు పాక్ వాటిపైనే, ఆధారపడినట్లుగా కనిపిస్తోంది.

ఎప్పుడైతే దౌత్య పద్ధతిలో ఉభయ దేశాల మధ్యగల సమస్య పరిష్కారం కాదో అప్పుడు అంతర్జాతీయ న్యాయస్థానానికి వెళ్లడమే ఏకైక మార్గం. హేగ్‌లో ఉన్న ఈ అంతర్జాతీయ కోర్టులో కూడా కొన్ని సమస్యలకు సరైన పరిష్కారం లభించకపోయే సందర్భాలు కూడా ఉంటాయి. అప్పుడు ఏ ఐక్యరాజ్యసమితో రాజీ ఏర్పాట్లకు ప్రయత్నించవచ్చు.

అప్పుడు కూడా సమస్య తెగకపోతే, ఈలోగా బరిలోకి ఇతర దేశాల జోక్యం కూడా ప్రవేశిస్తే అసలు సమస్య కాస్తా ప్రాణాంతకంగా మారి యుద్ధాలకు సిద్ధపడే ప్రమాదం కూడా ఏర్పడవచ్చు. పాక్-భారత మధ్య ఏ అంశమైనా దౌత్యపరంగా పరిష్కారమయ్యే రోజులు పోయాయి గనుక అంతర్జాతీయ న్యాయస్థానమనే మలిమెట్టు ఎక్కడం జరిగింది. ఆ న్యాయస్థానం ఉభయ పక్షాల వాదనలు కొంతవరకు విన్నది గనుక మిగతా విచారణ పూర్తయ్యేదాకా శిక్షను అమలు చేయకుండా మే 18న స్టే ఇచ్చింది. ఈ కేసులో ఇంతవరకు జరిగిన కథ ఇది. అయితే తుది తీర్పు ఎలా ఉంటుందనేది రెండు దేశాలలో ఏ దేశం ఎక్కువగా ఐసిజెను ప్రభావితం చేయగలదనే అంశంపైనే ప్రధానంగా ఆధారపడి కనిపిస్తుంది.

ఇక్కడ గమనించవలసిన విషయం మరొకటి ఉంది. ఐసిజెలో భారత్, పాక్ రెండింటికి సభ్యత్వం ఉన్నది గనుక కనీసం ఆ కోర్టుకు నివేదించే పరిస్థితయినా ఏర్పడింది. అలా కాకపోతే ఏం జరిగి ఉండేది? కోర్టు వెలుపలే ఒక పరిష్కారం కనుగొనవలసి వచ్చేది. ఆ ప్రత్యామ్నాయం భారత్, పాక్‌లకు చాలా కష్టమైన అంశం. ఇప్పటికే సరిహద్దుల వద్ద ఉద్రిక్తతలు తీవ్ర స్థాయికి వెళ్లిపోయాయి. నిత్యం పాక్ సైనికులో, ఉగ్రవాదులో మన జవాన్లను పొట్టన బెట్టుకుంటూనే ఉన్నారు. ఈ పరిస్థితిలో, ఇంత ఉద్రిక్తత నడుమ జాదవ్ సమస్యను కోర్టు బయట పరిష్కరించుకొనడమంటే అది నేరుగా యుద్ధానికి సిద్ధం కావడమే. ఐసిజెను ఆశ్రయించడం వల్ల ప్రస్తుతానికి ఆ ప్రమాదం నుండి బయట పడినట్లయిందిగానీ ఏదో ఉపద్రవం పొంచి ఉన్నట్లే అనుమానించవలసి వస్తోంది.

ఐసిజెలోని 11 మంది న్యాయమూర్తుల ధర్మాసనం జాదవ్ కేసును చాలా అత్యవసర సమస్యగానే పరిగణించి విచారణ చేపట్టింది. ఇరాన్‌లో వ్యాపారం చేసుకొంటున్న జాదవ్‌ను అపహరించుకొని వెళ్లి గూఢచారిగా, ఉగ్రవాదిగా పాక్ ముద్ర వేసిందనే భారత్ అభియోగానికి అంతర్జాతీయంగా విశేషమైన మద్దతు లభించింది. ప్రస్తుతం పాక్ సైన్యం అధీనంలో ఉన్న జాదవ్‌తో మాట్లాడేందుకు దౌత్య పద్ధతుల ద్వారా భారత్ చేసిన అన్ని ప్రయత్నాలను పాక్ అడ్డుకోవడంతో విధిలేని స్థితిలోనే భారత్ ఐసిజెను ఆశ్రయించింది.

సైనిక న్యాయస్థానంలో అందులోను పాక్ సైనిక న్యాయస్థానంలో విచారణ జరిగితే తీర్పులు ఎలా ఉంటాయో అందరికి తెలిసినదే కావడంవల్ల జాదవ్‌ను బయటికి తేవడానికి మరో మార్గం కనిపించ నందువల్లనే భారత్ ఐసిజెకు అప్పీలు చేసింది. అయితే జాదవ్ సమస్య అంతర్జాతీయ కోర్టు పరిధిలోది కాదని పాక్ వాదిస్తుండడంతో ముందుజరిగే విచారణలు పక్కదారి పట్టి సమస్య మరింత జటిలమయ్యే సూచనలే కనిపిస్తున్నాయి.

**********

కుల్‌భూషణ్ జాదవ్ గూఢచారి అవునా, కాదా. అనే ప్రశ్నకంటె అతడి విషయం ఇప్పుడు భారత్, పాక్‌ల బలాబలాల సమస్యగా మారుతున్నదేమో! అనే అనుమానం కలుగుతోంది. శిక్ష అమలుపై ఐసిజె ఇచ్చిన స్టేతో పాక్ దెబ్బతిన్న పులిలా మారుతుందనడంలో కూడా సందేహం లేదు. జాదవ్‌ను అడ్డుపెట్టుకొని ఉద్రిక్తతలు మరింతగా పెంచడం, ఏదో ఒక పాయింట్‌వద్ద ఆ ఉద్రిక్తతలను యుద్ధంగా మార్చడం పాక్ వ్యూహంగా కనిపిస్తోంది. జాదవ్‌పై చేసిన అభియోగాలకు ఒక్క ఆధారం కూడా బయట పెట్టలేకపోతున్న పాక్ కోర్టు విచారణలో గెలవడం కష్టమే అయినా, సమస్యను పక్కదారి పట్టించి చైనా మద్దతుతో భారత్‌పై తెగబడడానికి ప్రణాళికలు రూపొందించుకొంటున్నట్లుగా కూడా కనిపిస్తోంది. ఈ పరిస్థితిలో భారత్ అత్యంత జాగరూకతతో అడుగులు వేయవలసిన అవసరం ఉంది.

జాదవ్‌పై మోపిన అభియోగాల విషయంలో న్యాయబద్ధత ఎంత? హేతుబద్ధత ఎంత? అన్నది పరిశీలిస్తే రెండిటి శాతమూ చాలా తక్కువగానే కనిపిస్తుంది. గత మూడేళ్లలో 46 మంది పాకిస్థానీ గూఢచారులు పట్టుబడినా వారిలో ఏ ఒక్కరికి భారత్ మరణశిక్షను విధించలేదు. కానీ జాదవ్ గూఢచారి అవునో కాదో ఆధారాలు లేకుండానే కుట్రపూరిత అభియోగాలు మోపి పాక్ అతడికి మరణశిక్షను విధించింది. పాకిస్థాన్ వ్యవహరిస్తున్న తీరు 1963 నాటి వియన్నా ఒడంబడికకు విరుద్ధంగా ఉన్నదనే విషయం కూడా కాదనలేని సత్యం. వివిధ దేశాల్లోని దౌత్యకార్యాలయాల్లో పని చేసే సిబ్బందికి హక్కులు, దౌత్యపరమైన రక్షణలు ఏ విధంగా ఉండాలో, వాటికి ఎలాంటి ప్రమాణాలు పాటించాలో తెలియజేస్తూ 1963లో వియన్నాలో జరిగిన అంతర్జాతీయ సదస్సు కొన్ని తీర్మానాలు చేసింది. దౌత్య సిబ్బందికి ఇవ్వవలసిన రక్షణ చర్యలు ప్రపంచ వ్యాప్తంగా ఒకే విధంగా ఉండాలన్నది ఆ సదస్సు తీర్మానాల సారాంశం. అప్పట్లో భారత్, పాకిస్థాన్ సహా 43 దేశాలు ఆ ఒడంబడికపై సంతకాలు చేశాయి. తర్వాత ఐక్యరాజ్యసమితి చొరవతో మరికొన్ని దేశాలు కూడా ఆ ఒడంబడికను అంగీకరిస్తూ సంతకాలు చేశాయి. సమితి జనరల్ అసెంబ్లీ ఆమోదంతో 1967 మార్చి 19 నుంచి వియన్నా ఒప్పందం అమలులోకి వచ్చింది. అయితే ఆ ఒప్పందాన్ని ఉల్లంఘిస్తూ కొన్ని దేశాలు చర్యలకు పాల్పడడం, ఐక్యరాజ్యసమితి జోక్యంతో సర్దుబాటు కావడం ఇంత కాలం జరుగుతోంది. కానీ ఇప్పుడు పాక్ ఆ ఒప్పందాన్ని ఉల్లంఘించి జాదవ్‌కు ఏకంగా మరణశిక్ష విధించడంతో సమస్య అంతర్జాతీయ న్యాయస్థానానికి వెళ్లింది.

ఈ సందర్భంగా గమనించవలసిన విషయాలు కొన్ని ఉన్నాయి. పాక్ ఈ అంశాన్ని 'భద్రత సమస్య'గా మార్చడానికి ప్రయత్నిస్తున్నా ఆ ప్రయత్నం వెనుక దాగి వున్న కుట్ర స్పష్టంగా కనిపిస్తోంది. వియన్నా ఒప్పందాన్ని అమలు చేసే క్రమంలో ఏదైనా వివాదం తలెత్తితే దానిని ఐసిజె పరిధిలోకే తేవాలన్నది కూడా అప్పట్లోనే అన్ని దేశాలు అంగీకరించాయి. కానీ పాక్ వంటి దేశాలు తరచుగా ఉల్లంఘనలకు పాల్పడుతూనే ఉన్నాయి. ఇరు పార్టీల్లో ఎవరైనా ఐసిజెను ఆశ్రయించవచ్చనే నిబంధన కూడా వియన్నా ఒడంబడికలో ఉంది. ఆ ఒప్పందంలోని 36వ ఆర్టికల్ ఏ దేశంలోనైనా ఒక వ్యక్తిని అదుపులోకి తీసుకొన్నా, అరెస్టు చేసినా ఆ వ్యక్తి కోరుకుంటే తక్షణం ఆ సమాచారాన్ని అతని దేశ రాయబార కార్యాలయానికి అందజేయ వలసి ఉంటుంది. ఈ విషయంలో పాక్ పూర్తిగా ఉల్లంఘనకు పాల్ప డింది. అరెస్టయిన తమ దేశస్తుడిని జైలులో కలుసుకునే, మాట్లాడే హక్కు దౌత్య సిబ్బందికి ఉంటుందని వియన్నా ఒప్పందం చెబు తోంది. పాక్ ఈ నిబంధనను కూడా అతిక్రమించింది. అందుకే ఐసిజె తొలుత ఆ నిబంధనల ప్రకారం జాదవ్‌కు న్యాయ సహాయం లభించే ఏర్పాట్లు జరగాలని ఆదేశించింది. పాక్ కుట్ర ఏమిటో పూర్తిగా బయట పడుతున్నా, తాను ఆమోదించిన వియన్నా ఒప్పందాన్నే అతిక్రమిస్తున్నా పైకి మాత్రం గోముఖ వ్యాఘ్రంలా పోజు పెడుతూ సమస్యను, కేసును పూర్తిగా పక్కదారి పట్టించే ప్రయత్నం చేస్తోంది. ఈ విషయాన్ని ఐసిజె విచారణలో నిరూపించడానికి భారత్ న్యాయవాద బృందం యథాశక్తి ప్రయత్నించిందిగాని కేసుకు పూర్తిగా 'దేశ భద్రత' రంగు పులమడానికి పాక్ యత్నిస్తుండడంతో అంతిమ తీర్పు ఏ విధంగా ఉంటుందో? అనే ఆందోళన అందరిలో కలుగుతోంది.

జాదవ్‌ను కలవడానికి అనుమతించాలని భారత్ దౌత్య పద్ధతుల ద్వారా గత కొన్ని వారాలుగా చాలా ప్రయత్నాలే చేసింది. కానీ అతడిపై విచారణ రహస్యంగా సైనిక కోర్టులో జరపడంతో అతడితో మాట్లాడడానికి ఎవరిని అనుమతించబోమని పాక్ కరాఖండిగా తెలియజేసింది. అది పూర్తిగా వియన్నా ఒప్పందానికి విరుద్ధమని భారత్ వాదించినా పాక్ ససేమిరా అంటోంది. ప్రస్తుతం ఐసిజె నుంచి ఈ విషయంలో మన దేశానికి కొంత ఊరట లభించినా, కేసును పాక్ పక్కదారి పట్టించడంపై భవిష్యత్ విచారణలు ఆధారపడి ఉన్నాయనిపిస్తుంది.

ఐక్యరాజ్యసమితి ఆరు ప్రధాన విభాగాల్లో ఒకటైన అంతర్జాతీయ న్యాయస్థానం నెదర్లాండ్స్‌లోని దక్షిణ హాలండ్ ప్రావిన్స్, హేగ్ నగరంలో ఉంది. అంతర్జాతీయ చట్టాల ప్రకారం ఐసిజె ఏ కేసునయినా పరిష్కరిస్తూంటుంది. అధ్యక్ష, ఉపాధ్యక్షులు సహా మొత్తం 15 మంది ఎన్నికైన న్యాయమూర్తులతో పనిచేసే ఐసిజెలో జరిగే విచారణలకు, కోర్టు ఇచ్చే తీర్పులకు సభ్యదేశాలన్నీ కట్టుబడి ఉండవలసిందే. తాము అలా కట్టుబడి ఉంటామని ఆయా దేశాలు సంతకాలు చేసి ఉన్నందున అంతర్జాతీయ న్యాయసూత్రాల ప్రకారం ప్రతి సభ్యదేశం కోర్టు తీర్పునకు అనుగుణంగానే నడుచుకుంటూ ఉంటుంది. ప్రస్తుతం ఐసిజె అధ్యక్షుడుగా ఉన్న రోనీ అబ్రహాం చాలా నిష్పక్షపాతంగా వ్యవహరించే జడ్జిగా పేరున్నవారు ఆకవడంతో వియన్నా ఒప్పందం ఉల్లంఘన కింద ఆయన పాక్‌పై చర్యలు తీసుకోగలరనే న్యాయనిపుణులు భావిస్తున్నారు. అయితే వియన్నా ఒప్పంద ఉల్లంఘన వేరు, జావేద్ అనే వ్యక్తి పాక్ అంతర్గత భద్రత విచ్ఛిన్నానికి ప్రయత్నించాడనే అభియోగం వేరు. అందుకే పాక్ కుట్రను తిప్పికొట్టడంలో భారత్ న్యాయ నిపుణులు ఎంతవరకు కృతకృత్యులవుతారనే అంశంపైనే జాదవ్ భవిష్యత్తు ఆధారపడి ఉందనిపిస్తుంది.

దెబ్బతిన్న పులి ఎంత తీవ్రంగానైనా దాడి చేయగలదన్న వాస్తవాన్ని భారత్ న్యాయ నిపుణుల బృందం నిరంతరం గుర్తుంచు కోవలసిన అవసరం కూడా ఉంది. హరీష్ సాల్వే వంటి ఎదురులేని న్యాయవాదులు జాదవ్ కేసు విచారణలో ఉన్నందున అతడికి పూర్తి న్యాయం జరగవచ్చనే ఆశాభావం ఉన్నా, ప్రత్యర్థి పాక్ బలాన్ని కూడా తక్కువగా అంచనా వేయకూడదు గనుక మోడీ ప్రభుత్వం ఈలోగా అంటే ఐసిజె తుది తీర్పు ప్రకటించేలోగా పాక్ ప్రభుత్వంతో దౌత్య విధానం ద్వారా కూడా సమస్య పరిష్కరించ డానికి మరో ప్రయత్నం చేస్తే మంచిదనిపిస్తుంది. ఏ విధంగానైనా జాదవ్‌కు మరణశిక్ష పడకుండా చూడడం, అతడిని తిరిగి మన దేశానికి రప్పించడం ప్రభుత్వం అత్యవసర విధిగా భావించవలసి ఉంది.



# రికార్డుల బాహుబలి!

## మలుపు తిరిగిన తెలుగు సినిమా..

కవర్ స్టోరీ

ఎం.రామగోపాల్

**82 సంవత్సరాల తెలుగు సినీ చరిత్రలో సరికొత్త రికార్డులు నెలకొల్పుతూ, విడుదలైన రెండు వారాలకే ఏకంగా వెయ్యి కోట్ల వసూలు మార్కును దాటేసి ప్రపంచ సినీ జగత్తుకు తెలుగువాడి సత్తా ఏమిటో నిరూపించిన చిత్రం బాహుబలి-2. ఓ ప్రాంతీయ చిత్రం ఇంతటి మహోన్నత లక్ష్యాన్ని అందుకోవటం సామాన్యమైన విషయం కాదు.. దేశీయ సినిమాలకు రికార్డులను సృష్టించాలంటే తమ చిత్రాలకే సాధ్యమంటూ విర్రవీగిన బాలీవుడ్ జనాలు సైతం అచ్చెరువొందేలా ఓ దక్షిణాది చిత్రం రికార్డుల పరంపరలో దూసుకు పోగలదని బాహుబలి-1 నిరూపిస్తే, అంతకు మించిన రికార్డులను కొల్లగొట్టి, బాలీవుడ్‌కే సవాల్ విసిరింది బాహుబలి-2. ఈ చిత్ర ప్రత్యేకతలు, తెర వెనుక జరిగిన సుదీర్ఘ అవిరామ కృషి, కోట్ల పెట్టుబడి చిత్రాల కొత్త ట్రెండ్‌కు శ్రీకారం చుట్టిన వైనం వగైరా విశేషాలతో బాహుబలి-2 గురించి బహుముఖీన కథనం ఈవారం మీకోసం...**

సాధారణంగా ఓ సినిమా విడుదలవుతోందంటే... దాని విజయానికి పబ్లిసిటీయే ప్రాణం. ఒకప్పుడు సినిమా విడుదల అవుతోందంటే లౌడ్‌స్పీకర్లు, తరువాత థియేటర్లలో ట్రయిలర్లు ప్రేక్షకుల్ని మరిపించేవి. సాంకేతిక పరిజ్ఞానం పెరిగాక థియేటర్ల ఆక్యుపెన్సీ సగటున 10-15% మధ్య మాత్రమే ఉంటోంది. టీవీ వీక్షణానికే పరిమితమైన ప్రేక్షకుడిని థియేటర్లకు రప్పించడానికి లక్షల్లో ఖర్చుపెట్టి ప్రకటనలు చేస్తేగానీ రాని పరిస్థితి. ఐతే బాహుబలి-2 వందల కోట్ల రూపాయలు ఖర్చు పెట్టి నిర్మించినా లక్షలు, కోట్లు వెచ్చించి ప్రకటనలు చాలా తక్కువగానే కనిపిస్తాయి.

అలాగని సినిమా పబ్లిసిటీలో వెనుకబడ్డారా అంటే అదీలేదు. సినిమా ప్రమోషన్‌లో భాగంగా రూపొందించిన 50,000 చదరపు అడుగుల పోస్టర్ ఏకంగా గిన్నిస్ రికార్డునే సొంతం చేసుకుంది. అయితే దర్శకుడు రాజమౌళి ప్రధానంగా తన చిత్రాన్ని జనానికి మరింత చేరువ చేసేందుకు సామాజిక మాధ్యమాన్ని ఎంచుకున్నాడు. బాహుబలి ట్రైలర్ విడుదలైన రోజే యుట్యూబ్‌లో 4.5 మిలియన్, ఫేస్‌బుక్‌లో 1.5 మిలియన్స్ వ్యూయర్లు చూసారు. యూట్యూబ్‌లో తెలుగు, తమిళం, హిందీ, మళయాళం ఇలా ఒక రోజులో అత్యధికంగా వీక్షించిన వీడియోల జాబితాలో బాహుబలి ట్రైలర్ 7వ స్థానంలో నిలబడిందంటే... అప్పుడే చిత్రం ఏ స్థాయిలో ఉండబోతోందో అన్న ఆసక్తి సర్వత్రావ్యాప్తి చెందించడంలో రాజమౌళి సక్సెస్ సాధించబోతున్నట్లు రూఢీ అయ్యింది.



ఓ సినిమా బాగుందని టాక్ తెచ్చుకోవటానికి ఎంత ప్రయాసపడాలో జనం నాడి పట్టిన రాజమౌళి 2015లో విడుదలైన బాహుబలి 1 ముగింపులో కట్టప్ప బాహుబలిని ఎందుకు చంపా దన్న ప్రశ్నని లేవనెత్తి సగటు ప్రేక్షకుడిలో సైతం ఆ ఉత్కంఠని రెండేళ్లపాటు సాగించడం, ఆతనికే చెల్లింది. ఇందుకు తగ్గట్టుగానే ఆయన సామాజిక మీడియాలో చిత్ర విశేషాలను ఎప్పటికప్పుడు వెల్లడిస్తూ మౌత్ పబ్లిసిటీని మించిందిలేదన్న నమ్మకాన్ని నిరూపించగలిగాడు. రామోజీ ఫిలిం సిటీలో ఆడియో విడుదల, బాహుబలి 1 ప్రీ రిలీజ్ ప్రత్యేక టెక్నాలజీతో 360 డిగ్రీల కోణంతో లైవ్ స్ట్రీమింగ్ ప్రసారం చేయించారు. చిత్రంపై ఎన్నో రకాల ఊహాగానాలపై మౌనం వహిస్తూ సినిమా హైప్‌ని పెంచడం, దానిని కొనసాగించేలా చూడటం, చిత్ర యూనిట్‌లో హీరోలతో సహా ఎవ్వరినీ వార్తా కథనాలపై స్పందించ నీయకుండా చేయట..చివరికి ప్రేక్షకులు బాహుబలి-2 రాక కోసం ఎదురుచూసే పరిస్థితి అంతలా వ్యూహా త్మకంగా వ్యవహరించారు. కనుకనే తెలుగు సినిమా ఏ స్థాయిలో మార్కెట్ చేయగలదో, వసూళ్లని రాబట్టగలదో నిరూపించేలా... ఓ అద్భుతాన్ని ప్రపంచం ముందు ఆవిష్కరించగలిగారు రాజమౌళి.

### సాంబార్ చిత్రాల నుంచి సత్తా చూపే చిత్రంగా..

బాలీవుడ్‌కు దక్షిణాది చిత్రాలంటే చాలా చిన్న చూపు. కారణం

ఇక్కడి చిత్రాలన్నీ మూస పోసినట్లు ఒకే తరహాలో ఉండటమే అన్న భావన ఉంది. అందువల్లే ఒకప్పుడు మద్రాసు కేంద్రంగా తయారయి విడుదలైన చిత్రాలకు 'సాంబార్ చిత్రాలు' అని పేరు పెట్టుకున్నారు. ఇవి కేవలం ఒక ప్రాంతానికే పరిమితమని, తమ స్థాయిని అందుకో లేనివని బాలీవుడ్ చిన్న చూపు చూసేది. శంకరాభరణం లాంటి అడపా దడపా వచ్చిన చిత్రాలు మినహా నిజంగా దేశం సగర్వంగా తలెత్తుకునేలా చిత్రాలు రూపొందించడంలో మన పరిశ్రమ విఫలమైంది. జాతీయ అవార్డు స్వర్ణకమలాలని అందుకున్నా, దేశవ్యాప్తంగా వాటి ప్రదర్శనలు అంతంత మాత్రమే కావటం ఏదో ఓ మూల చివుక్కుమంటూనే ఉంది. బహుశా ఇదే దర్శకుడు రాజమౌళిలో ఆవేశం రగిల్చి ఉంటుంది. ఓ సాధారణ జానపద అంశం తీసుకుని, పెరిగిన సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించుకుంటూ, యావత్ ప్రపంచమే నివ్వెరపోయేలా సెల్యులాయిడ్ తెరపై అద్భుత దృశ్యకావ్యంలా రూపొందించడానికి ప్రేరణ ఇచ్చింది. ఇప్పుడు ప్రపంచంలో ఏ మూల చూసినా బాహుబలి -2 గురించే మాట్లాడుకునే పరిస్థితి ఉందంటే అదంతా రాజమౌళి బృందం విజయమే.



## రికార్డులన్నీ తిరగరాస్తూ...

సినిమా ప్రారంభం నుంచి విడుదల వరకు బాహుబలి రికార్డుల పరంపరం కొనసాగుతునే ఉంది. కేవలం వాటర్ సీన్ కోసం దేశవ్యాప్తంగా 19 జలపాతాల వద్ద 109 రోజుల పాటు ఈ చిత్రం కోసం కష్టబడ్డారు చిత్రం యూనిట్. 17 విఎఫ్ఎక్స్‌ల కోసం 85 కోట్లు ఖర్చు చేసి, ఎక్కడా తన ఊహలకు దృశ్యరూపం రావటంలో రాజీ పడకుండా వ్యవహరించాడు రాజమౌళి. ఈ చిత్రం కోసం జురాజిక్ వరల్డ్ చిత్రానికి పనిచేసిన విఎఫ్ ఎక్స్ టెక్నీషియన్స్‌కు తోడుగా మరో 800 మంది సాంకేతిక నిపుణులు నిరంతరంగా పనిచేయటం మరో విశేషం.



బాహుబలి-1లో ప్రత్యేకంగా ప్రపంచంలోనే లేని 'కిలికి భాష'ని సృష్టించడం, ఆ భాషకు 60 వ్యాకరణ సూత్రాలు, 750 పదాలను సృష్టించడం ప్రేక్షకుల్ని థియేటర్లలో కట్టిపడేసింది. ఆ క్రమంలోనే బాహుబలి 2లోనూ ఏం చేయబోతున్నా రన్న ఆసక్తి పెంచేలా చేసింది.

ప్రపంచవ్యాప్తంగా 32 భాషలలోకి అనువదించడం ఓ రికార్డయితే భారతదేశంలోని 30 రాష్ట్రాలలోనూ విడుదల కావటం మరో రికార్డు. అలాగే 9000 థియేటర్లలో విడుదలైన బాహుబలి-2 సంచలన విజయాన్ని నమోదు చేయటం మరో రికార్డు. ప్రపంచ వ్యాప్తంగా భారీ వసూళ్లు రాబట్టడంతో పాటు ఏళ్ల తరబడి చెక్కు చెదరకుండా నిలబడి ఉన్న రికార్డులన్నీ కుప్పకూల్చేసి మరి కొన్నాళ్ల పాటు చెదరని రికార్డులు సృష్టించింది.




సినిమా విడుదలైన 24 గంటలలోనే 100 కోట్లు కలెక్షన్లని రాబట్టిన సినిమా ఇది. శరవేగంతో ప్రేక్షకుల ముందుకు దూసుకు పోతూ వారిని థియేటర్లకు రప్పించడం ఒక వంతైతే... రోజుకి 5 ఆటలు, 6 ఆటలు వేసుకోండంటూ తెలుగు రాష్ట్రాలలోని ప్రభుత్వాలు ముందుకొచ్చి అనుమతులివ్వడం మరోవంతు. భారతీయ చలన చిత్ర చరిత్రలో మునుపెన్నడూ లేని విధంగా ఏకబిగిన 9000 స్క్రీన్స్‌పై బాహుబలి బల ప్రదర్శనకు దిగి తనేంటో నిరూపించాడు. ఇక ఒక్క అమెరికాలోనే 800 స్క్రీన్లలో ప్రదర్శింపబడిన ఏకైక భారతీయ చిత్రంగా నమోదుచేసుకుంది. అమెరికా, చైనా, ఆస్ట్రేలియా తదితర దేశాలలోని పలు మీడియా సంస్థలు బాహుబలి ఘనవిజయం పై ప్రత్యేక కార్యక్రమాలు రూపొందించి ప్రసారం చేసాయి. అంతర్జాతీయ మీడియా ఛానల్ బిబిసి సైతం వందేళ్ల ప్రపంచ సినిమా చరిత్రపై రూపొందిస్తున్న ప్రత్యేక డాక్యుమెంటరీకి బాహుబలిని ఎంచుకోవటం గమనార్హం. ఇది చాలు ఈ చిత్రం ఏ రేంజ్‌ని అందుకుందో అర్థం చేసుకోవటానికి.

## వసూళ్లు భళాభళి...

ప్రపంచ సినీ చరిత్రలో అత్యధిక వసూళ్లు చేసిన చిత్రంగా హిందీ చిత్రాలలో అమీర్‌ఖాన్‌కే దక్కింది. ఆయన నటించిన 'పికె' రూ.760 కోట్లతో అగ్రస్థానంలో నిలవగా, 'దంగల్' 716 కోట్లతో రెండో స్థానం దక్కించుకుంది. సల్మాన్ ఖాన్ 'బజ్రంగీ భాయీజాన్' రూ. 629 కోట్ల వసూలుతో మూడోస్థానంలో ఉంది. ఈ రికార్డులన్నింటినీ బాహుబలి-2 కేవలం మొదటి వారంలోనే తన హిందీ వెర్షన్‌ద్వారా తుడిచి పెట్టేయటం నివ్వెర పరిచేదే. నెట్ పరంగా తొలివారం కలెక్షన్ల రికార్డు ఇప్పటి వరకు సల్మాన్ 'సుల్తాన్' రూ. 208.82 కోట్లతో ఆధిపత్యం వహిస్తుంటే దాన్ని అధిగమిస్తూ బాహుబలి రూ. 247 కోట్లని వసూలు చేసాడు తన హిందీ డబ్బింగ్ వెర్షన్‌తోనే.

అలాగే టాప్ గ్రాసర్ తామేనంటూ బాలీవుడ్‌లో పోటీ పడుతున్న ఖాన్‌ల శకానికి ముగింపునిస్తూ, భారతీయ చలన చిత్ర చరిత్రలో మునుపెన్నడూ లేని విధంగా అతి తక్కువ సమయంలో వెయ్యి కోట్లు సాధించి ఓ తెలుగు సినిమా ఎలాంటి మైలురాళ్లు అధిగమించగలదో నిరూపించింది. అనూహ్యంగా లాభిస్తున్న ఈ కలెక్షన్ల పరంపరకు బాలీవుడ్ నిర్మాతలే కాదు, ట్రేడ్ వర్గాలూ ఆశ్చర్యపోతున్నాయి, సమీప భవిష్యత్‌లో బాహుబలి రికార్డులందుకోవటం బాలీవుడ్ అగ్రహీరోలకు సైతం సాధ్యం కాదేమోనని విస్తుపోతు న్నాయి. దేశ వ్యాప్తంగా రూ. 1020 కోట్లు గ్రాస్ వసూలుచేయగా, అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా, గల్ఫ్ ఇలా అన్ని దేశాల్లో రికార్డులనీ తుడిచి పెట్టేస్తూ, ఓవర్సీస్ గ్రాస్ రూ.230 కోట్లు వసూలు చేసింది.

దీంతో లైఫ్ టైమ్‌లో మరెన్ని రికార్డులను సృష్టించనుందోనన్న ఆందోళనా బాలీవుడ్‌లో మొదలైందన్నది వాస్తవం. ఎండా కాలంలో అందునా ఎలాంటి పండగలు లేని వాతావరణంలో విడుదలైన బాహుబలి కలెక్షన్‌ల మోత మోగించాడు. ప్రతి 10 సెకెన్లకి సగటున ఒకటి చొప్పున బాహుబలి టిక్కెట్ అమ్మకం జరిగిందంటూ ఆన్‌లైన్ టిక్కెట్స్ అమ్మకం దారులు వెల్లడించడమే ఇందుకు నిదర్శనం. సినిమా విడుదలైన 24 గంటల లోనే అత్యంత వేగంగా రూ.100 కోట్లు కలెక్షన్లు రాబట్టిన చిత్రంగానూ రికార్డు నెలకొల్పింది. సినిమా విడుదల తేదీ ఖరారు కాగానే అన్ని

థియేటర్లలోనూ బాహుబలి టిక్కెట్ల అమ్మకం నెల రోజుల ముందే ప్రారంభమైందని థియేటర్ వర్గాలు చెప్పాయి. దీంతో టిక్కెట్ అడ్వాన్స్ బుకింగ్ రూ 36 కోట్లు వసూలు అయ్యాయి. అలాగే పంపిణీదారులకు, థియేటర్లకే కాదు బ్లాక్‌లో టిక్కెట్లు అమ్ముకునే వారికి సైతం ఈ చిత్రం లాభాలు బాగానే అందజేసింది. తొలిరోజు ఒక్కోటిక్కెట్ ఏకంగా 500 నుంచి విజయవంతమైన మొదటి 10లో అంతర్జాతీయ చిత్రాలకు పోటీగా 2000 వరకు పలకడమే ఇందుకు ఉదాహరణ. విడుదలైన తొలి మూడు రోజులలోనే సుమారు ఐదు వందల కోట్లను సాధించిన బాహుబలి అదే సమరోత్సాహాన్ని ప్రదర్శిస్తూ, మూడు వారాలలోనే గ్రాస్ కలెక్షన్ దాదాపు 1500 కోట్లకు పైగా రాబట్టడం సంచలనం. అమెరికాలో ప్రదర్శిస్తున్న చిత్రాలలో 3వస్థానం బాహుబలి దక్కించుకుంది.




## శాటిలైట్ రైట్స్ అమ్మకాలలోనూ రికార్డు

యుఎస్‌లో కేవలం నాలుగు భాషలలో చిత్రాన్ని ప్రసారం చేసుకునేందుకు రూ.45 కోట్ల రూపాయలకు అమ్మినట్లు తెలుస్తోంది. అలాగే హిందీ చిత్రానికి సంబంధించిన శాటిలైట్ హక్కుల్ని సోనీ టెలివిజన్ సొంతం చేసుకుంది. ఇక తెలుగులో రెండు భాగాలను కలిపి రూ.28 కోట్ల రూపాయలకు అమ్మకం జరిగింది. ఇవికాక మిగిలిన భాషల శాటిలైట్ హక్కులు అదనపు మొత్తాలను చేర్చనున్నాయి. కేవలం సినిమా ఇండస్ట్రీనే కాదు షేర్ మార్కెట్‌ని సైతం ఉత్సాహభరిత పరుగులు పెట్టించింది. అప్పటి వరకు పడుతూ లేస్తున్న షేర్ మార్కెట్ బాహుబలి విజయంతో సెన్సెక్స్ పాయింట్స్ అమాంతం ఊపందుకుని 9300 మార్కు దాటింది. భారత స్టాక్ మార్కెట్ చరిత్రలోనే తొలిసారి నిఫ్టీ ఈ స్థాయి పాయింట్లని అధిగమించింది. దీంతో సెన్సెక్స్ 30 వేల మార్కుకి అతి చేరువ కాగా, లిస్టెడ్ కంపెనీల మార్కెట్ విలువ అమాంతం పెరిగి రూ 125 కోట్లకు చేరింది. ఓ సినిమా విడుదలైన ఒక్క రోజులోనే లక్ష కోట్ల ఇన్వెస్టర్లకు సంపదని ఆర్జించి పెట్టడం కూడా షేర్‌మార్కెట్‌లో సంచలనం సృష్టిస్తోంది.

## బాహుబలి మ్యూజియం

సాధారణంగా ఓ సినిమా పూర్తి కాగానే చిత్రీకరణకోసం వాడిన పలు వస్తువులను నిర్మాతలు అమ్మి పడేస్తారు. ఇటీవల కాలంలో హీరోలు వాడిన ప్రధాన వస్తువుల వేలంవెర్రి నెలకొని ఉన్నా రాజమౌళి రాజీ పడలేదు. బాహుబలి 1,2 చిత్రాల కోసం వాడిన ప్రతి వస్తువునీ జాగ్రత్త పరచి మ్యూజియం ఏర్పాటుకు సిద్ధమవ్వటం భారతీయ సినీ చరిత్రలోనే తొలిసారి కానుంది.

## కొత్త ఒరవడికి స్ఫూర్తిగా...

తెలుగు సినీ పరిశ్రమ ప్రారంభమైన నాటినుంచి ఎక్కువ చిత్రాలు, పౌరాణికాలు, జానపదాల సమ్మేళనంగా సాగింది. సాంఘిక చిత్రాల ఒరవడి ప్రారంభమైన దశలోనే 1938లో వచ్చిన 'మాలపిల్ల' చిత్రం అనేక సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా పలు చిత్రాల నిర్మాణానికి స్ఫూర్తిగా నిలిచింది. ఈ క్రమంలోనే గృహలక్ష్మి, వందేమాతరం, మళ్లీ పెళ్లి, వర విక్రయం, రైతుబిడ్డ ఇలా..వరుస చిత్రాలు వచ్చాయి. 1980వ దశకంలోసైతం మాదాల రంగారావు

# కుటుంబమే బలం..బలగంగా..

బాహుబలి చిత్రం కోసం దర్శకుడు రాజమౌళి కుటుంబంతో పాటు చిత్ర యూనిట్ సభ్యులు వారి కుటుంబ సభ్యులు పూర్తి స్థాయిలో సహకరించారు. ఇందులో ముఖ్యంగా బాహుబలిలో శివగామి (రమ్యకృష్ణ) మహేంద్ర బాహుబలిని ఒంటిచేత్తో ఎత్తుతూ... నదిలో మునిగిపోతున్నా, దృశ్యం ఇప్పటికీ ప్రజల మదిలో హత్తుకుపోయిన సన్నివేశమే.

ఈ సన్నివేశంలో శివగామి చేతిలోని బిడ్డగా నటించింది కేవలం 18రోజుల వయస్సున్న బేబి అక్షర. ఈ సినిమా కోసం కేరళలో చిత్రీకరణ జరుగుతున్నప్పుడే వల్లన్ (ప్రొడక్షన్ మేనేజర్)కు ఈ పాప జన్మించింది. ఇక ఈ చిత్రానికి రాజమౌళి తండ్రి విజయేంద్ర ప్రసాద్ కథ, మాటలు అందించగా సోదరుడు కీరవాణి సంగీతాన్ని అందించారు. కీరవాణి భార్య శ్రీవల్లి ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్‌గా, లైన్ ప్రొడ్యూసర్‌గా వ్యవహరించగా, రాజమౌళి భార్య రమ కాస్ట్యూమ్స్ డిజైనర్‌గా పనిచేశారు. అలాగే కీరవాణి తండ్రి రెండు పాటలు, కీరవాణి మూడు పాటలు రాయగా, కీరవాణి కుమారుడు కాలభైరవ పాటలు పాడారు. మరో అన్నయ్య కూడా ఈ చిత్రానికి తన సంపూర్ణ సహకారాన్ని అందించారు.

ఈ చిత్రంలో ఎమ్.ఎమ్.కీరవాణి తనయుడు సింహా, కుమార్తె కుముద్వతి,రాజమౌళి కుమార్తె మయూఖ, స్టైలిస్ట్ ప్రశాంతి కుమార్తె అనన్య, కెమేరామెన్ సింథేల్ తనయుడు ధృవ, రేయాన్‌లు చిత్రంలో



ప్రభాస్ మహారాజుగా వస్తున్నప్పుడు పాటలో పూలు జల్లుతూ మనకు కనిపిస్తారు.

ఐదేళ్లపాటు తన కుటుంబం సైతం చిత్రీకరణలో భాగస్వాము లైనందునే అద్భుత చిత్రాన్ని ఆవిష్కరించగలిగానంటాడు దర్శకుడు రాజమౌళి. నా చుట్టూ నా కుటుంబం లేకుంటే ఇంత పెద్ద బాధ్యతను మోయటం అంటే భయమేసిందని చెప్పటం ఓ విశేషం. ఈ చిత్రం షూటింగ్ జరిగినన్నాళ్లు వారు తన వెంటే ఉన్నారన్నారు. కష్టపడటం మా రక్తంలో ఉంది... ఈ సినిమా కోసం రోజుకు కనీసంగా 20 గంటలు పనిచేయటం వల్లే ఇంతటి అద్భుతాన్ని ఈ రోజు చూడగలుగుతున్నామన్నారు రమా రాజమౌళి.

ఎర్ర మల్లెలు విజయంతో పలు సామాజిక అంశాలపై విప్లవాత్మక చిత్రాలు అనేకం వచ్చాయి. ఈ క్రమంలోనే మృణాల్‌సేన్ రూపొందించిన ఒక ఊరి కథ స్ఫూర్తితో తెలంగాణా సాయుధ పోరాటం వేదికగా సాగిన కిషన్ చంద్ రచించిన 'జబ్ ఖేత్ జాగే' నవల ఆధారంగా వి.నర్సింగరావు 'మా భూమి' చిత్రాన్ని రూపొందించారు. ఈ చిత్రంలో 1950 నాటి హైదరాబాద్ రూపు రేఖలు, దొరల దౌర్జన్యాలు, భూ పోరాటాలు, రజాకారుల హింసలు చూపడంతో మరో నూతన అధ్యాయానికి నాంది పలికింది. ఈ ఒరవడినే సాగిస్తూ తెలంగాణా సంప్రదాయానికి నిదర్శనంగా నిలిచే చిత్రాలు అనేకం రూపొందాయి. వీటిలో జాతీయ అవార్డు అందుకున్న 'దాసి' కూడా ఒకటి.



మూసధోరణిలో సాగిపోతున్న తెలుగు సినిమాలు ఓ కాపు కాస్తూ, భారతీయ సంస్కృతీ సంప్రదాయాలకి, భారతీయ సంగీతానికి, నృత్యాలకి అత్యధిక ప్రాధాన్యత ఇస్తూ దర్శకుడు కె.విశ్వనాథ్ రూపొందించిన శంకరాభరణం అనేక చిత్రాలకు స్ఫూర్తిగా నిలిచింది. తారాబలం కన్నా, కథ, కథనాలకు శ్రావ్య మైన సంగీతం తోడైతే సంచలన విజయం అందుకోవటం ఖాయం అనేందుకు ఈ చిత్రమే ఓ ఉదాహరణ. శాస్త్రీయ సంగీత చిత్రాలు ఈ రోజుల్లో ఎవరు చూస్తారంటూ నొసళ్ల చిట్లించిన విశ్లేషకులను సైతం విస్తుపోయేలా చేసింది. శంకరాభరణం స్ఫూర్తిగా అగ్రదర్శకుడు దాసరి నారాయణ రావు, జంధ్యాల, వంశీ వంటి పలువురు దర్శకులు నృత్య, సంగీత కథాంశాలతో చిత్రాలను నిర్మించి విజయాలను సాధించడమే ఇందుకు ఉదాహరణ.



తెలుగు పరిశ్రమలోఉ నిత్యం కొత్తదనాన్ని తీసుకురావడంలో పరితపించిన సినీనటుడు కృష్ణ నటించిన 'మోసగాళ్లకు మోసగాడు' చిత్రం టాలీవుడ్‌లో 'కౌబాయ్' చిత్రాలకు నాంది వాచకంగా నిలిచింది. వాస్తవానికి అప్పటికే కొన్ని 'కౌబాయ్' తరహా చిత్రాలు వచ్చినా ప్రేక్షకులను ఆకట్టుకోలేక పోయాయి. కాని, 'మోసగాళ్లకు మోసగాడు' కథ, కథనాలు విశేషంగా ఆకట్టుకోవడంతో పాటు వెండితెరపై నిండైన స్కోప్ చిత్రంగా రూపొందటం ప్రేక్షకుల్ని థియేటర్ల ముంగిటకు పరుగులు తీయించింది. ఈ క్రమంలో జయలలిత, విజయ లలిత, తదితర కథానాయికలను సైతం ఈ తరహా చిత్రాలలో ప్రధాన పాత్రలుగా కౌబాయ్ చిత్రాలు విజయవిహారం చేసాయి.




శరత్ రాసిన 'దేవదాసు' చిత్రం అదే పేరుతో భారతీయ భాషలన్నింటిలో సినిమాగా రూపొందింది. తెలుగులో అక్కినేని నటించిన 'దేవదాసు' అఖండ విజయంతో టాలీవుడ్ నిర్మాతల దృష్టి నవలా చిత్రాల వైపు మళ్లింది అనడంలో సందేహం లేదు. గురజాడ అప్పారావు కన్యాశుల్కం మొదలు విశ్వనాథ సత్యనారాయణ 'ఏకవీర' వరకు కథలు, రచనలు చిత్రాలుగా రూపాంతరం చెందాయి. ముప్పాళ్ల రంగనాయకమ్మ నవల ఆధారంగా 'బలిపీఠం' యద్దనపూడి సులోచనా రాణి 'జై జవాన్' అరికపూడి కౌసల్యాదేవి 'ప్రేమ్‌నగర్, 'శంఖు తీర్థం నవలలు సినిమాలుగా రూపొంది వరుస విజయాలు సాధించాయి. పొత్తూరి విజయలక్ష్మి రాసిన 'శ్రీవారికి ప్రేమలేఖ' వంశీ 'మహల్‌లో కోయిల'తో పాటు యండమూరి వీరేంద్రనాథ్ రాసిన పలు నవలలు సినిమాలుగా రూపొందించబడ్డాయి. అలాగే మల్లాది వెంకట కృష్ణమూర్తి, కోలపల్లి ఈశ్వర్, కొమ్మనాపల్లి గణపతిరావు, మల్లిక్, జి.వి. అమరేశ్వరరావు తదితర రచయితల నవలలు సినిమాలుగా వచ్చాయి. ఇటీవలి కాలంలో ఇంద్రగంటి మోహనకృష్ణ దర్శకత్వంలో వచ్చిన 'గ్రహణం' సినిమాకు చలం 'గుణదోషం' నవల ఆధారం కాగా, కాశీపట్నం రామారావు రచించిన 'యజ్ఞం', రాచకొండ విశ్వనాథ శాస్త్రి 'ఆరు సారాయి కథలు' సారాయి వీర్రాజుగా వచ్చి తెలుగు సినిమా పరిశ్రమలో కొత్తదనాన్నిచూపాయి.

పరిశీలనాశక్తి సామర్థ్యంతో దర్శకుడిగా మారిన మాటల రచయిత జంధ్యాల సహజత్వానికి పెద్దపీట వేస్తూ, హాస్య ధోరణలో సాగే అనేక చిత్రాలను రూపొందించారు. 'శ్రీవారికి ప్రేమ లేఖ' లగాయితు 'అహనా పెళ్లంట' ఆయన సున్నిత హాస్యానికి పరాకాష్టగా నిలిచాయి. ఈ క్రమంలోనే ఇ.వి.వి. సత్యనారాయణ, ఎస్.వి.కృష్ణారెడ్డి తదితర దర్శకులు కామెడీ చిత్రాల నిర్మాణంలో అందె వేశారు. అలాగే పాత చిత్రాల పాటల పల్లవులను సినిమా పేర్లుగా మలచడంలోనూ జంధ్యాల సాగిం చిన పంథా ఇప్పటికీ కొనసాగుతూనే ఉంది.

తాజాగా బాహుబలి-2 కొత్త ట్రెండ్ సృష్టించింది. కథ, కథనాలు సినిమా విజయానికి ఎంత బలాన్నిస్తాయో, బాహుబలిలో నటించిన ప్రతిపాత్ర జనం ముందుకు కదలి వచ్చిందా? అనేలా నటీనటులంతా జీవించారు. రీ రికార్డింగ్, విజువల్ ఎఫెక్టులు సినిమాను అందని తీరాల వైపుకు తీసుకెళ్లాయి. దర్శకుడిపై నమ్మకంతో ఐదేళ్ల పాటు నిర్విరామంగా పని చేసిన సాంకేతిక నిపుణుల కృషి ప్రతి ఫ్రేమ్‌లోనూ ఆవిష్కృతమైంది. అంతేకాదు ఎంత కష్టపడితే అంత ప్రతిఫలం అందుతుంది ..అనేందుకు ఎన్నో సినిమాలకు స్ఫూర్తి నిచ్చింది. బాహుబలి ఇచ్చిన స్ఫూర్తిని మన తెలుగు చిత్ర పరిశ్రమ కొనసాగించాలి. వినూత్న చిత్రాలకు శ్రీకారం చుట్టి విజయాల శాతాన్ని పెంచాల్సిన బాధ్యత నిర్మాత, దర్శకులపై ఎంతైనా ఉంది.

లోకం పోకడ...

# పేరుకు పెద్దది..కానీ పిరికిది



ఫొటోలోని పిల్లిగారిని చూశారా. దీని పేరు ఒమర్. అతి పెద్ద పిల్లిగా గిన్నిస్ బుక్ రికార్డ్‌కెక్కబోతోంది. దీని పొడవు 3 అడుగుల 9 అంగుళాలు. బరువు 14 కిలోలు. దీని యజమాని మెల్‌బోర్న్‌కు చెందిన స్టెఫెనీ హర్స్ట్. స్టెఫెనీ మాట్లాడుతూ 'నేను, ఒమర్, 9 కిలోల వరకు పెరుగుతుందనుకున్నాను, అది పెరుగుతూ పెరుగుతూ ఇప్పుడు సాధారణ పిల్లి కంటే 3 రెట్లు పెద్దగా తయారైంది. ఒమర్‌ను కొన్నప్పుడు చిన్నగా ఉంది, ఆ తర్వాత క్రమంగా పెరుగుతూ ఏడాది వయసు వచ్చేసరికి 10 కేజీల బరువుకు చేరింది' అంది.

ఇప్పుడు ఒమర్ వయసు మూడేళ్లు. ఇంకో తమాషా ఏమిటంటే చూడటానికి ఒమర్ ఎంత పెద్దగా ఉన్నా, వాస్తవానికి అది ఎంతో పిరికిది అంటుంది స్టెఫెనీ. ప్రస్తుతం 'లూడో' అనే పిల్లి అతి పొడవాటి పిల్లిగా రికార్డులకెక్కింది. దాన్ని అధిగమించే ప్రయత్నం చేస్తోంది ఒమర్. అది ఎంత పొడవుగా ఉన్నా, చాలా పిరికిది అంటోంది దాని యజమానురాలు. దీన్ని బట్టి సైజు ఎంత ఉన్నా పిల్లి పిల్లే అనుకోవచ్చు.

# అనస్తీషియాకు బదులుగా మిరపనూనె

మిరప ఘాటుగా ఉంటుందన్నది తెలిసిందే. అయితే నార్త్ వేల్స్‌లోని సెయింట్ అసఫ్‌కు చెందిన మైక్ స్మిత్ ఓ పెద్ద చెఫ్. ఆయన ఓ కొత్తరకం



మిరపను పండించాడు. దానిపేరు డ్రాగన్స్ బ్రెత్. గత ఏడేళ్లుగా మైక్ స్మిత్ మిరప, ఇతర కూరగాయలను పండిస్తున్నాడు. డ్రాగన్స్ బ్రెత్ రకం మిరప పరిమాణం 2.48మి.మీ. ఉంటుంది. ఇది విపరీతమైన కారం ఉండి తింటే ఒకరకమైన షాక్ ఇస్తుందట. మైక్ స్మిత్ ఇలా అంటాడు... 'నేను డ్రాగన్ మిరపను పూర్తిగా తినలేదు. కేవలం నాలిక అంచున రుచిచూశాను. ఒకటే మంట.. మంట. భరించలేక పది సెకండ్లలో నేను దాన్ని ఉమ్మేశాను. చాలా సేపు నోరు మండుతూనే ఉంది. నాటింగ్‌హామ్ ట్రెంట్ యూనివర్సిటీతో కలిసి సంయుక్తంగా తాను వైద్యంలో ఉపయోగించేందుకుగాను ఈ కొత్తరకం



మిరపను సృష్టించానని చెప్పాడు. చాలామంది రోగులకు అనస్తీషియా అలర్జీ ఉంటుంది. అటువంటి వారికి దీని నూనెను వాడితే అనస్తీషియా ఇచ్చినట్లుగానే వారి చర్మం మొద్దుబారిపోతుంది. బాధ తెలియదు. పైగా అనస్తీషియా ఎక్కువ ఖర్చుతో కూడుకొన్నది కాబట్టి అభివృద్ధి చెందుతున్న దేశాలలో అనస్తీషియాకు బదులు డ్రాగన్ మిరపనూనెను వాడుకోవచ్చు' అంటాడు మైక్ స్మిత్.

# స్కూళ్లలో కథలు చెప్పే అమ్మమ్మలు!

గతంలో పిల్లలకు ఇంట్లో అమ్మమ్మలు, బామ్మలు చక్కగా కథలు చెప్పేవారని, ఉమ్మడి కుటుంబాలుపోవటంతో ఇప్పుడు ఆ అవకాశం లేదని అంటుంటారు కదా. అయితే రాజస్థాన్‌లో త్వరలో రాష్ట్రంలోని బడులన్నిటికీ అమ్మమ్మలు, బామ్మలే వచ్చి పిల్లలకు కథలు చెపుతారట. అక్కడి ప్రభుత్వ పాఠశాలల్లో ఈ ఏర్పాటు చేయడానికి ప్రభుత్వం నిర్ణయించింది. ప్రతినెల మొదటి శనివారం ఉదయాన పిల్లలకు కథలు చెప్పే కార్యక్రమం ఉంటుంది. ఈప్రత్యేక కార్యక్రమానికి 'బాల సభాస్ విత్ గ్రాండ్ మదర్స్' అని నామకరణం చేశారు. దీనివల్ల పిల్లల చదువులో పెద్దలపాత్రకూడా ఉండటం, పెద్దల విజ్ఞానం పిల్లలకు అందటం, కుటుంబ విలువలు బలపడటం జరుగుతాయని రాజస్థాన్ సెకండరీ ఎడ్యుకేషన్ డిప్యూటీ డైరెక్టర్ అరుణ్‌కుమార్ శర్మ అంటారు. పిల్లలు చక్కగా ఎందరో బామ్మలు, అమ్మమ్మలు చెప్పే కథలు విని వినోదాన్ని, విజ్ఞానాన్ని పొందవచ్చు. రాజస్థాన్ ప్రభుత్వం లాగే ఇతర రాష్ట్రాలుకూడా ఈ పద్ధతిని అనుసరిస్తే పిల్లలకు మేలు!



# కృతి

## అలనాటి కేరళకు అక్షరరూపం



మలయాళంలో 1889లో వెలువడిన 'ఇందు లేఖ' ఆ భాషలోనే మొట్టమొదటి నవలగా పేరొందిం ది. రచయిత ఒ.చందుమీనన్. ఆచార్య జయప్రకాశ్ ఈ నవలను ఇంచుమించు యధాతథంగానే తెలుగు లోకి అనువదించారు. కథ.. ఇందులేఖ ఒక సంపన్న యువతి. మాధవన్ అనే బంధువుల యువకుడు, ఇందులేఖ పరస్పరం ప్రేమించుకుంటారు. అన్యాపదేశంగా పెద్దల సమ్మతి కూడా ఉంటుంది. తండ్రి గతించిన ఇందులేఖ తాతగారి ప్రాపున ఉంటుంది. అపోహ వల్ల ఆమె తాతగారు మాధవన్‌ను తిర స్కరించి ఆమెను మరో సంపన్నుడు నంబూద్రిపాదు'కు ఇవ్వ నిశ్చయి స్తాడు. ఒకదశలో వారి పెళ్లి జరిగినట్లుగానే ప్రచారం జరుగుతుంది. ఉద్యోగరీత్యా మదరాసులో ఉన్న మాధవన్ ఈవార్త విని వికల మన స్కుడై ఉత్తర భారత యాత్రకు బయలు దేరుతాడు. చివరకు ఇందులేఖ, మాధవన్‌ల పెళ్లితో కథ సుఖాంతమవుతుంది. మాతృ స్వామ్య వ్యవస్థ బలంగా వేళ్లూనుకున్న కేరళలో స్వాతంత్ర్యానికి పూర్వం అక్కడి ఉమ్మడి కుటుంబాలు, ఆనాటి ధనికవర్గ స్థితి గతులు, ఆంగ్లభాషమీది ప్రేమ, కట్టుబాట్లు కళ్లకు కట్టారు. గొప్ప వర్ణన, యూరప్, భారతదేశ తత్త్వ విచారణ, పోలికలు, భేదాలు.. ఎన్నెన్నో అంశాలను ఆసక్తికరంగా ఇమిడ్చారు.

**(ఇందులేఖ:ఒ.చందుమీనన్; అనువాదం:ఎస్.జయప్రకాశ్; వెల: రూ. 305;ప్రతులకు:సంచాలకులు, నేషనల్ బుక్ ట్రస్ట్ ఇండియా, నెహ్రూ భవన్, 5 ఇన్‌స్టిట్యూట్ ఏరియా, ఫేజ్- II, వసంత్‌కుంజ్, న్యూఢిల్లీ-110070)**

-కూర చిదంబరం

## పసందైన పాటల కతలు..




తెలుగు భాషపై ఇష్టంతో, ప్రేమతో..తమప్రాంతం హోసూరులోని పల్లెపాటలనాధారంగా చేసుకొని,ఆయా పాటలకు లంకె కలుపుతూ చక్కటి చిన్నిచిన్ని కథలను రచించి 'దణి' పేరిట అందించారు అగరం వసంత్. దీనివల్ల కథతో పాటు ఆ ప్రాంతంలోని జానపద పాటలను పదిలపరిచినట్లయింది. 'దణి' అంటే ధ్వని. ఇందులో పాటలతోనే వెతలు తీరుస్తారు, పాటలతోనే హిత బోధచే స్తారు, పాటలతోనే నవ్విస్తారు, ఏడిపిస్తారు.'కమ్మ' కతలో బీరి వెత పడుతూ కూడా పైకి చెప్పదు. నాగమ్మ పాట అందుకుని గోళుగోళున ఏడ్చు కొని గౌరమ్మ/ చిలకవన్నె చీర చించి/ కాకికాలిలో అమ్మకు కమ్మ (జాబు)పంపినాది../ కన్నతల్లి కమ్మనేమో చదివి నాది/ కమ్మ చదివి కన్నీళ్లే యిడిసినాది..అది విని బీరి దుఃఖం ఆప కోలేకపో తుంది. తన వెతనంతా చెపుతుంది. నాగమ్మ బీరి వెతను దూరంచేస్తుంది. పాతతరానికి, కొత్తతరానికి తేడాచూపుతూ 'డాగ్‌కాదు డాగు'..అవ్వ డాగు పాట పాడిందంటే మనవరాలు డాగ్ (కుక్క) పాట పాడిందను కుని పాడమంటుంది. తీరా అది డాగు..మరక అని తెలుసుకుని మనవరాలు ఆశ్చర్యపోతే ఆ మాటకి రెండర్థాలున్నాయని తెలుసుకొని అవ్వ నోరు తెరుస్తుంది. 'ఆంధ్రా వాళ్లనింక.'లో చివర, తావుల్నికాదు ఒగటి సేయాల్సింది, మన తెలుగు జనాల్ని ఒగటి సేయాల.. తెలు గంటే ఆంధ్రా, తెలంగాణమాత్రమే కాదనే విషయాన్ని తెలుగోళ్లంతా తెలుసుకోవాల..' అని అవ్వతో పలికించడం ఎంతో బాగుంది.

**(దణి..పల్లెపాటల కతలు:అగరం వసంత్; వెల:రూ. 100; ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు)**

-జె.శ్యామల

## ఇది తెలంగాణ శకం



క్రీస్తు శకం, శాలివాహన శకం, విక్రమార్క శకం.. ఇలా మహామహుల పేర శకములను వర్ణించడం చరిత్ర; 'శకము' అంటే ఒక దేశము లేదా ఒక జాతి లేదా ఒకరి పాలనతో చేరిన సంవత్సరము, ప్రత్యేక తెలంగాణ రాష్ట్రావిర్భావ సందర్భాన్ని 'శకము'గా అభివర్ణిస్తూ ప్రముఖ విద్యావేత్త, పద్యకవి వెలపాటి రామరెడ్డి వచన, గేయ, పద్య కవితలతో వాడుకభాషలో 'నవశకం- తెలంగాణ శకం' పేరిట ఓ గ్రంథాన్ని వెలువరించారు.

85 సంవత్సరాల ఈ జ్ఞానవృద్ధుడు పక్కా తెలంగాణ బిడ్డ. తెలంగాణ అంటే అమితమైన ప్రేమ, యిష్టం. తెలంగాణపై అసంఖ్యాక గ్రంథాలు వెలువరించిన అనుభవజ్ఞుడు.

'నీళ్లు, నిధులు, నియామకాలు మనవి మనకు కావాలి' అన్న ప్రాతిపదికన ఉద్యమ సారథ్యం వహించిన కేసీఆర్‌ను.. 'అతడే పిత మరియు నిర్మాత యతడే/ సతత హరిత మాతనిపేరు చరితమందు' అంటూ పద్యాభిషేకం గావిస్తారు.

'కాళోజీ కుటుంబం/ పలు భాషల కదంబం' అని ప్రశంసిస్తూ, దాశరథి సోదరుల యాదిలో నిమగ్నమౌతూ, మిషన్ కాకతీయ, భగీరథ పథకాలకు జోహారులర్పిస్తూ, శ్రీసత్యసాయి వైభవాన్ని శ్లాఘిస్తూ వెలపాటి వారు విరజిమ్మిన తెలంగాణ భాషా పరిమళాలు ఆఘ్రాణించాల్సిందే.

**(తెలంగాణ శకం: వెలపాటి రామరెడ్డి; వెల:రూ.100; ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక విక్రేతలు హైదరాబాద్, వరంగల్)**

-రమణ వెలమకన్ని

## అలరించే అధిక్షేప కవిత్వం..




సీనియర్ పాత్రికేయులైన వేల్పుల నారాయణ ఓ తెలుగు దినపత్రికలో చురక కాలం పేరిట రన్నింగ్ కామెంటరీ రాశారు. దాన్నే ఇప్పుడు పుస్తకంగా వెలువ రించారు. అధిక్షేప కవిత్వాన్ని (కార్టూన్ కవిత్వం) రాం భట్ల కృష్ణమూర్తి, గజ్జెల మల్లారెడ్డి, దేవిప్రియ, నండూరి రామ్మోహన్‌రావు, తెలకపల్లి రవి మొదలైన సాహితీవేత్తలు సుసంపన్నంచేశారు. ముళ్లపూడి వెంకటరమణ, అలి శెట్టి ప్రభాకర్‌లతోపాటు కార్టూన్‌ల ద్వారా చిత్రకారుల కృషి ప్రశంసనీ యం. 'చురక'లోని కవితలకు జావేద్ గీతలు చక్కగా కుదిరాయి. వీరి చురకల్లో కొన్నిటిని ప్రస్తావించుకొందాం.

ఆర్థిక సామ్రాజ్యానికి/ ఆహ్వానం పలికిందా
మోడీ ప్రభుత్వమింకా/ మోకరిల్లి పోతుందా
ఒబామాతో ఒనగూడె/ సహజ భాగస్వామ్యం
అనుబంధం కౌగిలింపా/ స్వేచ్ఛా విపణి చలాయింపా (పేజీ-1)
చైనాలో చంద్రబాబు/ చకచకమని తిరిగేనా
పరిశ్రమల కొరకు సిరుల/పంటలకే తెచ్చేనే
నవ్యాంధ్రకు రూపశిల్పి/ నవ స్వప్నం ముందు నిలిపే
ఎర్ర చైనా గెలుపు నిజం/ ఎక్కుతుందా కాస్త నిజం (పేజీ-26)
మన రాష్ట్రం మనపాలన/ అధికారం మనకు దక్కు..
అలాగే 'ముల్లుగర్ర' శీర్షికలో...కె.సి.ఆర్ మాట ట్రిక్కు/ తెస్తుందా
ఏలే హక్కు (పేజీ-177). చదివించే చురకలివి.

**(చురక-రన్నింగ్ కామెంటరీ:వేల్పుల నారాయణ; వెల: రూ.125; ప్రతులకు: నవచేతన, విశాలాంధ్ర)**

-తంగిరాల చక్రవర్తి




# ప్రేమోపహతులు!

కస్తూరి మురళీకృష్ణ

'తన విచిత్రమైన ప్రేమ కథ ఈరకంగా ముగుస్తోందా?' తన గుండెల్లో, తన కొడుకు 'షిరోయ్' దించిన కత్తిని చూస్తూంటే ఖోస్రో మనసులో ఈ ఆలోచన మెదిలింది.

కత్తి గుండెల్లో దిగుతూ తెంచిన నరాల నుంచి రక్తం గబగబ వెచ్చగా వెలికి వస్తోంటే ఖోస్రో మనస్సు విచిత్రంగా స్పందించింది.

ఏమిటి మనిషి? మాంసం రక్తమేనా? మనిషి కోరికలు, బాధలు, సంతోషాలు అన్నీ ఈ మాంసం, రక్తం అనుభవిస్తాయా?

షిరీన్‌పై తన కోరిక కూడా ఈ రక్తం, మాంసమేనా?

తన చుట్టూ మడుగులా ఏర్పడుతున్న రక్తంలో షిరీన్‌ను వెతకాలని ప్రయత్నించాడు ఖోస్రో.

అది చూసి ఖోస్రో కొడుకు షిరోయ్ ఇంకో కత్తిని అతడి పొట్టలో దింపాడు. బుసబుస రక్తం పొంగింది.

రక్తం మాంసం కలిగించే ప్రేమ అనే కోరిక కోసం ఎందరి రక్తాలను చిందించాడు తను!

చివరికి తన రక్తం చిందటంతో ఆ కోరిక ఆవిరైపోతోంది. ఎక్కడికి పోతుంది? 'షిరీన్ దగ్గరకా?'

'షిరీన్'...అరిచాననుకున్నాడు ఖోస్రో. కానీ అతడి గొంతులోంచి గుసగుసగా శబ్దం వెలికి వచ్చిందంతే.

*********

'ఖోస్రోను షిరోయ్ హత్య చేశాడు. ఇప్పుడు కత్తి పట్టుకుని మీ దగ్గరకు వస్తున్నాడు. పారిపోండి' గబగబా, ఆత్రంగా, భయంభయంగా చెప్పింది పరిచారిక.

ఖోస్రో రాకకోసం ఎదురుచూస్తూ అలంకరించుకుంటున్న షిరీన్ నింపాదిగా పరిచారిక వైపు చూసింది.

చేతిలో ఉన్న సుగంధ ద్రవ్యాన్ని మెల్లిగా పక్కన పెట్టింది.

'ఖోస్రో మరణించాడా?' మృదువుగా అడిగింది.

తమ రాణి వార్త విని ఎలాంటి దుఃఖం, భయం ప్రదర్శించక పోవటం పరిచారికను ఆశ్చర్యానికి గురిచేసింది.

'మరణించారు. మరణించేవరకూ షిరోయ్ అతడిని పొడుస్తూనే ఉన్నాడు. ఇప్పుడు ఇక్కడకు...' గదిలోకి అడుగుపెట్టిన షిరోయ్‌ను చూసి భయంతో వణికిపోతూ మాటలాపేసి పక్కకు తప్పుకుంది పరిచారిక.

తనవైపు క్రూరంగా చూస్తున్న షిరోయ్ వైపు నిర్భయంగా, ప్రశ్నార్థకంగా చూసింది షిరీన్.

'ఖోస్రోను చంపేశాను' కసిగా చెప్పాడు షిరోయ్.

'తండ్రిని హత్య చేయటం పాపం. కానీ రాజ్యాధికారం కోసం కన్న తండ్రిని, సోదరులను హత్య చేయటం ఆనవాయితీగా మారుతోంది' నిట్టూర్చింది షిరీన్.

'నేను రాజ్యంకోసం హత్య చేయలేదు' అన్నాడు షిరోయ్.

'మరి?' ప్రశ్నార్థకంగా చూసింది షిరీన్.

'నేను నీకోసం హత్య చేశాను' చేతిలోని కత్తిని జారవిడిచి మోకాళ్లపై కూర్చుని దీనంగా అన్నాడు షిరోయ్.

'నా కోసమా?' ఆశ్చర్యపోయింది షిరీన్. ఆమె మనసులో ఒక అవ్యక్త భావన కదిలింది. అసహ్యంతో ఆమె శరీరం ముడుచుకు పోయింది.

'నీకోసం ఫర్హాద్‌ను మరణం వైపు నెట్టాను'

గతం లోతుల్లోంచి ఖోస్రో స్వరం వినిపించింది.

ఖోస్రో, షిరీన్‌లు ప్రేమించుకున్నారు. ఒకరినొకరు చూడకుండానే ఒకరి గుణగణాలొకరు విని జీవితాంతం కలిసి జీవించాలని నిశ్చయిం చుకున్నారు. కానీ వారిద్దరూ కలవటానికే ఎంతోకాలం పట్టింది.

ఖోస్రోని కలవాలని షిరీన్ అతని స్థలానికి వెళ్తే, ఆమెని కలవాలని ఖోస్రో ఆమె స్థలానికి వచ్చాడు.

దారిలో ఇద్దరూ ఒకరినొకరు చూసినా మారువేషాల్లో ఉండటంతో గుర్తించలేకపోయారు. చివరికి ఇద్దరూ కలిశారు. ఒకరినొకరు కలసి ఉండలేమనుకున్నారు. కానీ అప్పటికి రాజ్యంలో తిరుగుబాటు జరిగి ఖోస్రో సామ్రాజ్యాధికారాన్ని కోల్పోయాడు.



అయితే షిరీన్‌తో కలసి ఉన్న ఆనందంలో సామ్రాజ్యం పోయినా ఫరవాలేదన్నట్టు కర్తవ్య నిర్వహణ పట్ల విముఖతను ప్రదర్శించాడు ఖోస్రో.

అది షిరీన్‌కి నచ్చలేదు. వ్యక్తికి జీవితంలో కర్తవ్య నిర్వహణను మించినదేదీ లేదు. మరో వ్యక్తిపై ప్రేమ దైవం నిర్దేశించిన కర్తవ్యాన్ని విస్మరించేట్టు చేయకూడదు. అలా చేస్తే ఆ వ్యక్తి ప్రేమలో ఏదో లోపం ఉన్నట్టు. దైవాన్ని ధిక్కరించే ప్రేమ, ప్రేమకాదు. దైవాన్ని విస్మరించి, దైవంకన్నా వ్యక్తిని మిన్నగా భావించే ప్రేమ దోషం తప్ప పవిత్రం కాదు.

ఇదేమాట ఖోస్రోతో నిర్మొహమాటంగా చెప్పింది. 'నీ రాజ్యాన్ని నువ్వు తిరిగి సాధించుకురా. అప్పుడు నేను నిన్ను స్వీకరిస్తాను. అంతేకాని పరాజితుడై ప్రేమ ముసుగులో తన చేతకానితనాన్ని, భీరత్వాన్ని దాచేవాడిని నేను స్వీకరించను' నిర్ద్వంద్వంగా చెప్పింది.

దాంతో షిరీన్ కోసం ఎలాగయినా రాజ్యాన్ని తిరిగి సాధించే పట్టుదలతో బయలుదేరాడు ఖోస్రో. షిరీన్ ఖోస్రోను కార్యోన్ముఖుడిని చేయాలనుకుని కఠినంగా వ్యవహరించింది. లేకపోతే, షిరీన్ వల్ల ఖోస్రో ప్రపంచాన్ని మరచి ఆమె దాసుడయ్యాడని అందరూ ఆడిపోసుకుంటారు. కాబట్టి ఆ అపప్రథ తొలగించుకునేందుకు ఆమె అలా వ్యవహరించింది. కానీ ఫలితం అనూహ్యమైన రీతిలో వారి ప్రేమకు అడ్డుగోడగా నిలిచింది.

తన రాజ్యాన్ని తిరిగి సాధించేందుకు మద్దతుకోసం ఖోస్రో కాన్‌స్టాంటినోపుల్ చేరి సీజర్ సహాయం అభ్యర్థించాడు. సీజర్ సహాయం చేసేందుకు సిద్ధమయ్యాడు. కానీ ఒక షరతు విధించాడు. ఖోస్రో సీజర్ కూతురు మరియమ్‌ను వివాహమాడాలి. ఆమె జీవించి ఉన్నంతకాలం మరో వివాహం చేసుకోకూడదు.

రాజ్యం గెలిచి షిరీన్‌తో జీవితం గడపాలన్న ఆత్రంలో ఖోస్రో సీజర్ షరతులన్నిటికీ ఒప్పుకున్నాడు. రాజ్యం గెలిచాడు. కానీ షిరీన్‌ని పొందలేకపోయాడు. ఎందుకటే సీజర్‌కు ఇచ్చిన మాట అడ్డువచ్చింది.

మరియమ్‌కు కూడా షిరీన్ పట్ల ఖోసో ప్రేమ తెలుసు కాబట్టి షిరీన్‌ను ఖోసో కలిసే అవకాశాలు కలగనివ్వలేదు. వెయ్యి కళ్లతో ఖోసోను గమనించేది. దాంతో మనసు షిరీన్ పై ఉన్నా మనిషి తన రాజ్యంలో జీవచ్ఛవంలా గడుపుతూ షిరీన్‌ను కలిసే ఘడియకోసం ఎదురుచూడసాగాడు ఖోసో.

తాను విధించిన నిబంధన తన ప్రేమ ఫలవంతమవటానికి అడ్డుగోడగా నిలవటంతో షిరీన్ దిక్కుతోచక నిరాశకు గురయింది. మనసు ఖోసో దదగ్గర, మనిషి అతనికి దూరంగా జీవచ్ఛవంలా అయిపోయింది. ఖోసోను కలిసే ఘడియ కోసం ఎదురుచూడసాగింది.

ఇంతలో ఖోసో, షిరీన్‌ల నడుమ మరో అడ్డుగోడ నిలిచింది ఫర్హాద్ రూపంలో. ఫర్హాద్ ఓ శిల్పి. షిరీన్ రూపం చూసి మోహించాడు. ఖోసోకు దూరమై ఆమె పడుతున్న వేదనను గ్రహించాడు. సాంత్వన వచనాలు పలికాడు. ఆమె నిరాశ, నిస్పృహలను తనకనువుగా వాడుకున్నాడు.

'ఖోసోకు మీమీద ప్రేమ ఉంది. కానీ మరియమ్‌తో జీవిస్తున్నాడు. ఆమెతో సంతానం కన్నాడు. అంటే అన్నీ అనుభవిస్తున్నాడు. అలాంటప్పుడు తమరు మాత్రం మోడులా నిలచి, కోరికలన్నీ చంపుకుని, యవ్వనంలో సన్యాసినిలా అతనికోసం ఎదురుచూస్తూ గడపాల్సిన అవసరం ఏముంది? ఖోసోలానే అతడిని ప్రేమించండి. నాతో జీవించండి' అంటూ పలురకాల వాదనలు చేసేవాడు.

'నేను నిన్ను ప్రేమించలేను' అంది షిరీన్ బలహీనంగా.

'నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నీకోసం ఏమైనా చేస్తాను' అన్నాడు ఫర్హాద్.

అయితే, షిరీన్‌పైన ఫర్హాద్ ప్రేమ విషయం ఖోసోను చేరింది.

షిరీన్‌తో ఏదో ఒకరోజు కలసి జీవితం సాగించవచ్చన్న ఆశతో జీవిస్తున్న ఖోసో ఆగ్రహం పట్టలేకపోయాడు. కానీ ఫర్హాద్‌తో కఠినంగా వ్యవహరిస్తే, షిరీన్‌కు అతడిపై ప్రేమ కలగవచ్చు. తనపై ద్వేషం పెరగవచ్చు. అందుకని ఓరోజు ఫర్హాద్‌ను పిలిచాడు.

'నీకు షిరీన్‌పై ప్రేమ ఉందా?' అడిగాడు.

'ఉంది'.

'నేను షిరీన్‌ను ప్రేమిస్తున్నాను తెలుసా?' గద్దించాడు.

'తెలుసు. షిరీన్‌ను ప్రేమించే హక్కు భగవంతుడు మీ ఒక్కరికే ఇవ్వలేదు'

'షిరీన్ నన్ను ప్రేమిస్తోంది తెలుసా?' కోపంగా అన్నాడు ఖోసో.

'మిమ్మల్ని తప్ప మరెవరినీ షిరీన్ ప్రేమించకూడదని భగవంతుడు నిర్దేశించలేదు'

'నువ్వు షిరీన్ కోసం ఏమైనా చేస్తావా?'

'చేస్తాను'

'బేహిస్తున్ కొండకు మెట్లు చెక్కు. షిరీన్‌ను నేను వదలుకుంటాను'.

'సంతోషంగా' అన్నాడు ఫర్హాద్.

'ఈ విషయం తెలిసిన షిరీన్, ఫర్హాద్‌ను మందలించింది. 'అతి అసంభవమైన కార్యం'.

'ప్రేమ అసంభవాన్ని సంభవం చేస్తుంది. నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నీకోసం ఏమైనా చేస్తాను. నేను చేస్తున్నదంతా నీకోసమే' అన్నాడు ఫర్హాద్.

తరువాత, అతని మరణవార్త విన్నది షిరీన్. అతడు కొండరాయి మీదనుంచి జారిపడి మరణించాడని తెలిసింది. నిట్టూర్చింది.

ఇక తాను పూనుకుని ఏమైనా చేయకపోతే జీవితాంతం ఖోసో ఎదురుచూపులతో గడపాల్సి ఉంటుందని అర్థమయింది షిరీన్‌కు.

ఫలితంగా రహస్యంగా మరియమ్‌పై విషప్రయోగం చేయించింది.

మరియమ్ మరణంతో ఖోసో, షిరీన్‌లు ఒకటయ్యేందుకు ఉన్న ప్రతిబంధకాలన్నీ తొలగిపోయాయి. ఖోసో, షిరీన్‌లు ఆనందంగా జీవితం గడపటం ఆరంభించారు. తాము ఇన్నాళ్లూ ఎదురుచూసింది ఈ ఆనందం, ఈ సౌఖ్యం, ఈ తన్మయత్వం, ఈ ప్రశాంతత, ఈ స్నేహం కోసమే అని భావించారు.

అయితే, మరియమ్ కొడుకు షిరోయ్ మాత్రం ఆరంభం నుంచీ షిరీన్ పట్ల కోపం ప్రదర్శిస్తూనే ఉన్నాడు. బహుశా షిరీన్ వాళ్లమ్మను చంపించిందన్న గాలి వార్తలను అతను నమ్ముతున్నాడేమో' అన్న అనుమానం షిరీన్ పలుమార్లు వ్యక్తపరిచింది.

ఒకరోజు షిరీన్, ఖోసోలు తామిద్దరూ ఒకటవ్వటంకోసం తాము చేసిన త్యాగాలు, పడ్డ కష్టాలను నెమరువేస్తున్నప్పుడు ఖోసో, ఫర్హాద్ మరణం వెనుక అసలు నిజం చెప్పాడు.

'ఎక్కడ ఫర్హాద్ నిన్ను నాకు దూరంచేస్తాడో అన్న భయంవేసింది. అందుకని కొండమీద నుంచి వాడిని తోయించి చంపించాను. నీమీద ప్రేమ నన్ను హంతకుడిని చేసింది' అన్నాడు.

క్షణకాలం ఆశ్చర్యపోయినా తరువాత నవ్వేసింది షిరీన్.

'నేను నీకోసం హత్య చేశాను. మరియమ్ ఎన్నటికీ చావదేమోనన్న భయంతో ఆమెని హత్య చేయించాను' నిజం చెప్పింది షిరీన్.

ఇద్దరూ ఒకరిపట్ల ఒకరికి ఉన్న గాఢప్రేమను తలచుకుని ఆశ్చర్యపోయారు. ఎన్ని అడ్డంకులు దాటుకుని కూడా తాము ప్రేమను ఫలవంతం చేసుకున్నందుకు మురిసిపోయారు.

*********

'నేను నీకోసం ఖోసోను హత్యచేశాను. నా తండ్రిని హత్యచేశాను. నన్ను స్వీకరించవా?' బతిమిలాడుతూన్నట్టున్న షిరోయ్ స్వరం విని ఈ గతం నుంచి వర్తమానానికి వచ్చిపడింది షిరీన్.

'నేను నీకు తల్లి వరుస అవుతాను' అంది.

'కాదు. నా తల్లి మరియమ్. నేను నిన్ను ప్రేమించాను. నిన్ను పొంది తీరుతాను. నీకు మరో ఆస్కారం లేదు. బలవంతంగానయినా నేను, నువ్వు నన్ను ప్రేమించేట్టు చేసుకుంటాను. ఇప్పుడు నేనే రాజును' లేచి నిలబడ్డాడు షిరోయ్.

అతడిని పరిశీలనగా చూసింది షిరీన్.

'నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా?' అడిగింది.

'అవును. అందుకే..నీ కోసమే నా తండ్రిని సైతం హత్య చేశాను. నీకోసం ఫర్హాద్‌ను చంపించాడు ఖోసో. ఖోసో కోసం మరియమ్‌ను చంపించావు నువ్వు. నీకోసం ఖోసోను చంపాను నేను. కాబట్టి నువ్వు నా దానివే' అన్నాడు.

షిరీన్ పెద్దగా నవ్వింది. 'చంపించటమే ప్రేమ అయితే..అలాంటి ప్రేమ నాకు అవసరంలేదు. జీవించే ప్రేమ కావాలి. అది నీకు అర్థంకాదు' అంది.

'నన్ను స్వీకరిస్తున్నట్టా? కాదా?' కోపంగా అరిచాడు షిరోయ్.

'పిచ్చితనం, పశుత్వం ప్రేమకాదు'. నేనోసారి ఖోసోను చూడాలి' అంది షిరీన్. అతడి సమాధానం కోసం చూడకుండా ఖోసో శవం పడి ఉన్న స్థలానికి వెళ్లింది.

ఖోసో శవం చుట్టూ రక్తపుమడుగు ఉంది. గుండెల్లో కత్తి ఉంది.

'కలసి ఉండాలని ఎంతో తపన పడ్డారు. కానీ పట్టుమని పదికాలాలపాటు కలసి ఉండలేదు. కానీ ఆ కలసి ఉన్న సమయం కోసం మళ్లీ పదిజన్మలు ఎత్తి ఇంతకన్నా ఎక్కువ కష్టాలు పడేందుకు సిద్ధం' అనుకుంది షిరీన్. వంగి ఖోసో గుండెల్లోంచి కత్తి ఇవతలకి లాగింది. దానికి ఖోసో రక్తం అంటి ఉంది.

'ఆగు' అరుస్తూ ముందుకు దూకాడు షిరోయ్. కానీ అతడు ఆమెని చేరేలోగా ఆమె ఖోసో రక్తంతో తడిసి ఉన్న కత్తిని తన గుండెల్లో దింపింది.

'ఖోసోనీ నన్ను ఎవరూ విడదీయలేరు. అతడు లేని లోకం నాకనవసరం' అంది షిరీన్.

వైద్యులను కంగారుగా పిలిచాడు షిరోయ్. అంతలోనే గుండెల్లోంచి కత్తిని వెలికితీసి మళ్లీ పొడుచుకుంది షిరీన్. 'నాకు వైద్యులవసరం లేదు. ఖోసో కావాలి' అంది. ప్రాణాలు విడిచింది.

*********

ఖోసో, షిరీన్, ఫర్హాద్‌ల కథ పర్షియన్ చరిత్రలో, సాహిత్యంలో అత్యంత ప్రాచుర్యం పొందిన కథ. నిజామిగంజవి, ఫరూఖి, ఖత్రోన్ తోసహా పలువురు పర్షియన్ కవులు ఈ గాథను తమ రచనల ద్వారా అమరంచేశారు.

# తేడాలు గుర్తిస్తారా



పిల్లలూ! ఈ 2 బొమ్మల మధ్య ఉన్న తేడాలు గుర్తిస్తారా!



### మీకు తెలుసా?

* భూతద్దాన్ని 1250లో బ్రిటన్‌కు చెందిన రోగర్ బేకన్ కనుగొన్నాడు.

* విశ్వంలో 100 బిలియన్ల గెలాక్సీలు ఉన్నాయి.

* గ్రే వేల్ ప్రతి ఏటా ఆర్కిటిక్ నుంచి 1,250 మైళ్లు ప్రయాణించి మెక్సికోకు వలస పోతుంది.

## పదాన్వేషణ-21

నిర్వహణ
గుల్ మహమ్మద్ నాయక్

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| R,A | B,E | C,L | S,W | M,N | D,P |

పిల్లలూ! కింది ఆధారాలకు ఎదురుగా ఉన్న అంకెలను చూడండి. ఆ అంకెలతో సంబంధం ఉన్న పై గళ్లలోని రెండు అక్షరాలతో ఆధారానికి తగిన జవాబును రెండు ఆంగ్ల పదాలతో రాయండి.

ఉదా:ఆధారం: డబ్బులు పెట్టుకునే చిన్న సంచి-5,6

అంటే 5వ గడిలోంచి ఒక అక్షరం, 6వ గడిలోంచి ఒక అక్షరం తీసుకుని జవాబు రాయాలి.

జవాబు: 5వ గడిలోంచి 'M', 6వ గడిలోంచి 'P' తీసుకుని 'MONEY PURSE' అని జవాబు రాయాలి.

ఆధారాలు:

1.జీవన శైలి -3,4.........
2.సూర్య కిరణాలు - 4,1 ........
3.నెలవారీ జమాఖర్చుల పద్దు. -5,2 ..........
4.వాహనముల వేగమును నిరోధించేది - 4,2 .............
5.క్రికెట్‌లో బంతులను విసిరే పద్ధతుల్లో యిదొకటి - 4,2 .....

# భయంలేని ఆలోచన

కథ

అదో చిన్న గ్రామం. అక్కడ వందేళ్లనాటి పాఠశాల ఉంది. ఎందరో విద్యార్థులు అక్కడ విద్యాభ్యాసం చేసి ప్రపంచ వ్యాప్తంగా అనేక ఉన్నత పదవుల్లో స్థిరపడ్డారు. అయితే ఒకప్పటి విద్యార్థులతో పోలిస్తే ప్రస్తుతం అక్కడ విద్యాభ్యాసం చేస్తున్న వారిలో ఆత్మవిశ్వాసం తక్కువగా కనిపిస్తుంది. వేదికపై నిలబడి పదిమంది ముందు మాట్లాడటానికి కూడా విద్యార్థులు భయపడేవారు. పాఠశాలలో ఏ పోటీలు జరిగినా విద్యార్థులు పాల్గొనేవారు కాదు. ప్రధానోపాధ్యాయుడు సద్గుణ్ పిల్లల్లోని సభా భయాన్ని పోగొట్టి ఆత్మవిశ్వాసాన్ని పెంచే కార్యక్రమాన్ని చేపట్టకపోతే వారు జీవితంలో ఉన్నత శిఖరాలను అధిరోహించడం కష్టమని భావించాడు. ప్రముఖ వ్యక్తిత్వ వికాస నిపుణుడు ప్రొఫెసర్ పరంధామయ్య ప్రసంగాలను ఏర్పాటు చేసి విద్యార్థుల్లో చైతన్యం కలిగించి, వారిలో భయంలేని ఆలోచనలను పెంపొందించాలని పూనుకున్నాడు.

ఈ నేపథ్యంలో ప్రొఫెసర్ పరంధామయ్య పాఠశాలకు వచ్చి ప్రసంగించారు.

విద్యార్థులు ఆయన ప్రసంగాన్ని తదేకంగా వింటున్నారు.

మీలో ఎవరైనా సరే ఈ వేదికపైకి వచ్చి నేను అడిగిన ప్రశ్నకు సరైన సమాధానం చెబితే ఒక ఏడాదిపాటు మీ చదువుకు సంబంధించిన ఖర్చంతా నేనే భరిస్తాను' అన్నాడు పరంధామయ్య.

ఒక్కసారిగా సభా ప్రాంగణమంతా గంభీరంగా మారిపోయింది. నిశ్శబ్దం నలుమూలలా అలుముకుంది.

మళ్లీ ప్రొఫెసర్ మాట్లాడుతూ 'మీలో ఎవరైనా సరే ఈ వేదికపైకి వచ్చి నేను అడిగిన ప్రశ్నకు సరైన సమాధానం చెబితే ఒక ఏడాది పాటు మీకు స్కూల్ యూనిఫాం, పుస్తకాలకు అయ్యేఖర్చుతో పాటు పాఠశాల ఫీజు కూడా నేనే చెల్లిస్తాను' అని చెప్పారు.

నేను సమాధానం చెబుతాను' అని వేగంగా వేదికమీదికి వెళ్లాడు సహజ్.

అంతా కరతాళ ధ్వనులు చేశారు.

'నీ పేరేంటి?' ప్రశ్నించాడు పరంధామయ్య.

'సహజ్' సమాధానమిచ్చాడు విద్యార్థి.

'నా ప్రశ్నకు జవాబు చెబితే నేను ఇస్తానని ప్రకటించినవన్నీ సహజ్‌కు బహుమతిగా అందిస్తున్నాను' అన్నాడు పరంధామయ్య.

అందరూ ఆశ్చర్యపోయారు.

'మీరు ఏ ప్రశ్నా అడగలేదు కదా?' కొందరు పరంధామయ్యను ప్రశ్నించారు.

'కానీ పేరు ఏమిటి? అనే ప్రశ్నను నేను అడిగాను కదా. నేను ఏవో ప్రశ్నలు వేస్తానని వాటికి మీరు బదులు చెప్పలేకపోతే ఇంతమందిలో అవమానం కలుగుతుందనే







# వార్త ఆదివారం

భయం మీ ఆలోచనల్లో ఉంది. అందు వల్లే వేదికపైకి రావడానికి చాలా మంది భయపడ్డారు. అటువంటి ఆలోచనలకు దూరంగా ఉండి ఈ విద్యార్థిలా ఆత్మవిశ్వాసాన్ని పెంచుకోవాలి. విద్యార్థి దశనుండే సభా భయాన్ని పోగొట్టుకుని కమ్యూనికేషన్ స్కిల్స్‌ను అలవరచుకోవాలి. కేవలం చదువుకుని ఎక్కువ మార్కులు తెచ్చుకున్నంతమాత్రాన ఈ రోజుల్లో ఉన్నత శిఖరాలకు చేరుకోలేరు. చదువుతోపాటు సంస్కారాన్ని నేర్చుకుని సమగ్రాభివృద్ధికి దోహదపడే అన్ని అంశాలను మీరు నేర్చుకోవాలి. ఉపాధ్యాయులు, తల్లిదండ్రులను, పెద్దలను గౌరవిస్తూ బాల్యం నుండే ఉన్నత లక్ష్యాలను ఏర్పరచుకుని వాటిని సాకారం చేసుకోవడానికి కష్టపడి కాకుండా ఇష్టపడి కృషిచేయాలి. అప్పుడే జీవితంలో రాణించగలరు' అన్నాడు పరంధామయ్య.

ఆనాటి నుండి ఆ పాఠశాలలో విద్యార్థులు భయంతో కూడిన ఆలోచనలకు స్వస్తిపలికి చదువుతో పాటు సమగ్రాభివృద్ధికి దోహదపడే అన్ని పోటీలలో పాల్గొని చక్కటి వ్యక్తిత్వాన్ని అలవరచుకుని అన్ని రంగాలలో సమున్నత స్థానాన్ని పొంది తమ పాఠశాలతో పాటు గ్రామానికి కూడా మంచిపేరు తెచ్చారు.

-షేక్ అబ్దుల్ హకీం జాని తెనాలి.

**పదాన్వేషణ-21 జవాబులు**

1.LIFE STYLE 2.SUN RAYS 3.MONTHLY BUDGET 4.SPEED BREAKER 5.SPIN BOWLING

**తేడాలు గుర్తిస్తారా జవాబు**

1.చెట్టు2.పక్షులు3.కాలర్ 4.ఉడత
5. రాయి 5.కుక్క తోక
6.నోరు తేడా 7.గడ్డిపూలు
8.పంపు 9.నీళ్లు



## హలో ఫ్రెండ్...

చిన్నారుల ప్రశ్నలకు

వార్త సిఎండి, మేనేజింగ్ ఎడిటర్

## గిరీష్ అంకుల్ సమాధానాలు

**డి. కార్తికేయ, హైదరాబాద్.**

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్తే. నేను ఏడో తరగతి చదువుతున్నాను. ఆహార పిరమిడ్ అంటే ఏమిటి? దానికి, జీవవైవిధ్యానికి సంబంధం ఏమిటి? దయచేసి చెప్పండి.**

**జవాబు:** కార్తికేయా! ఆహార వినియోగపు అలవాట్లను బట్టి వినియోగదారులను శాకాహారులుగా, మాంసాహారులుగా విభజించడం జరిగింది. పులులు మాంసాహారులు. అవి ఎప్పటికీ శాకాహారులుగా మారలేవు. అలాగే కుందేలు శాకాహారి. ఎట్టి పరిస్థితులలోను మాంసాహారిగా మారలేదు. కానీ మానవుల్లో మాత్రం శాకాహారులు ఉన్నారు, మాంసాహారులు ఉన్నారు, రెండూ తినేవారు కూడా ఉన్నారు. వీరిని సర్వభక్షకులు అనవచ్చు. వినియోగదారుల ఆహార వినిమయం ఆధారంగా వరసక్రమంలో పేర్చితే ఏర్పడే దానిని ఆహార గొలుసు అంటారు. ఇది పిరమిడ్ ఆకారంలో ఉంటుంది. జీవావరణ వ్యవస్థలో మనిషి తాను ఒక భాగమనే విషయాన్ని విస్మరిస్తున్నాడు. ఆహార గొలుసులో పైన ఉండే మానవుడు, కిందిస్థాయిలో ఉండే ఆహార ఉత్పత్తిదారులైన అడవులను నాశనం చేస్తున్నాడు. జనాభా విపరీతంగా పెరిగిపోతోంది, పెరిగిన జనాభా అవసరాలు తీర్చడానికి ఉత్పత్తిదారులైన అడవులు అంతకంతకూ క్షీణిస్తున్నాయి. ఈ దుష్పరిణామం వలన ఆహార పిరమిడ్ తల్లకిందులవుతుంది. జీవవైవిధ్యానికి తీరని విఘాతం ఏర్పడుతుంది. అడవులు నశించడంతో, అడవుల్లో ఉండే జీవులు కూడా క్రమంగా నశించిపోతాయి. ఇప్పటికే కొన్ని జీవజాతులు శాశ్వతంగా ఈ జీవావరణం నుండి అంతరించిపోయాయి. మరికొన్ని జాతులు అంతరించిపోయే స్థితికి చేరుకున్నాయి.

**ఎస్.కావ్య, విజయవాడ.**

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్తే. నేను ఏడో తరగతి చదువుతున్నాను. వాహనాల టైర్లలో గాలి ఎందుకు నింపుతారు? దయచేసి చెప్పండి.**

**జవాబు:** కావ్యా! నీకోసంగతి తెలుసా? 1900 సంవత్సరం వరకు రోడ్డుపై వాహనాలన్నీ గట్టి టైర్లతోనే నడిచేవి. అయితే దారిలో ఏదైనా గట్టి అడ్డు తగిలితే బండి ఇరుసు మొత్తం పాడయ్యేది. పైగా ఆ కాలంలో రహదారులు సాఫీగా లేకుండా గతుకులుగా ఉండేవి. దాంతో ఆ బండ్లలో ప్రయాణం అనుకూలంగా ఉండేది కాదు. గాలి నిండిన టైర్లను న్యూమాటిక్ రకం అంటారు. రోడ్డులో ఎగుడుదిగుడున్నా, అడ్డంకులు ఉన్నా ఎక్కువ కుదుపు లేకుండా ఈ టైర్లలో ఉండే గాలి కదులుతూ అడ్డుకుంటుంది. లోపలిగాలి ఒత్తిడితో ఉండటం వల్ల ఇది వీలవుతుంది. గాలి ఉన్న టైర్లు కింద నేల తీరు ప్రకారం ఆకారం మారుతూపోతాయి. కాబట్టి బండికి మంచి పట్టు దొరుకుతుంది. బండిని వేగం మార్చడం, మలుపు తిప్పడం బాగా సులభమవుతుంది.



# కనుమరుగైన కళలకు ప్రాణం!

ప్రస్తుత తరం విదేశీ వ్యామోహంలో మునిగితేలు తోందని అంతా వాపోతుంటారు. ఇది ఒక వైపు దృశ్యమైతే, మరోవైపు భారతీయ కళా నైపుణ్యాలు విదేశాలలో మంచి పాపులారిటీ సంపాదించటమే కాదు, అక్కడి అభిరుచులకు తగ్గట్టుగా కళాకృతులను అందించి కొత్త ట్రెండ్ సృష్టించడమూ జరుగుతోంది. సంప్రదాయ కళారీతులు క్రమంగా సన్నగిల్లి, కనుమరు గవుతూ, దేశీయ కళలకు కాలం చెల్లిపోతోందన్న నిరాశ ఆవరిస్తున్న వేళ... 'ఫంకీ కళాకార్' ప్రాచ్య, పాశ్చాత్య రీతుల కలయికతో దేశీయ చేతివృత్తులకు కొత్త వేదికను ఏర్పాటుచేసింది



మహారాష్ట్రలో చీరల వర్తకం చేసే కుటుంబానికి చెందిన అమి అల్వి 'ఫంకీ కళాకార్' సంస్థను ప్రారంభించారు. దీనికంతటికీ పునాది ఎలా పడిం దంటే.. ఆయన 2015లో ఓసారి లండన్‌లోని విక్టోరియా అండ్ ఆల్బర్ట్ మ్యూజియంను సందర్శించారు. యాదృ చ్ఛికంగా ఆ సమయంలో అక్కడ ' ది ఫ్యాబ్రిక్ ఆఫ్ ఇండియా' ప్రదర్శన నిర్వహిస్తున్నారు.

ఆ ప్రదర్శనలో 1590-2015 వరకు వెలుగుచూసిన పెయింటెడ్ ఫ్యాబ్రిక్స్‌ను ప్రదర్శించటంతోపాటు, ఆయా వస్త్ర విశేషాలను, వివరాలను ..ఏ నూలు, పట్టు వస్త్రం వాడిందీ, వెజిటబుల్ డైయింగ్ విధానం, చేతి ఎంబ్రాయిడరీలు మొదలైనవన్నీ వివరించారు. పారిశ్రామికీకరణకు ముందు మొత్తం ప్రక్రియలు చేతులతోనే జరిగేవి. అవి మన్నికగా, పర్యావరణహితంగా ఉండేవి అంటారు అమి.



ఆ ప్రదర్శన తిలకించిన అమీ అల్వి మనసులో ఒక ఆలోచనా దీపం వెలిగింది. వెంటనే పేరొందిన 'లండన్ ఇన్‌స్టిట్యూట్ సెంట్రల్ సెయింట్ మార్టిన్స్'లో ఫ్యాషన్ డిజైనింగ్‌కు సంబంధించి స్వల్పకాలిక కోర్సులో చేరాడు. ఆ తర్వాత 2016లో లండన్ ఫ్యాషన్ వీక్ (సెప్టెంబర్)లో కూడా పాల్గొన్నాడు. అదే సందర్భంలో తన బాల్యమిత్రుడు అమిత్ జైన్‌ను కలిసి, ఫ్యాషన్‌కు తగినట్లుగా భారతీయ సంప్రదాయ కళలను జోడించి ఉత్పత్తులను రూపొందిస్తే.. అన్న ఆలోచనను ముచ్చటించాడు.

అతని ఆలోచనకు అమిత్ ఎంతగానో ప్రభావితుడై వెంటనే అంగీకారం తెలిపాడు. అదుగో..అప్పట్నుంచి ఇక వెనుతిరిగింది లేదు.

భారత్‌కు తిరిగివచ్చి, ఉత్తరభారతంలోని మారుమూలల్లో ఇంకా సజీవంగా ఉన్న సంప్రదాయ కళల్ని అధ్యయనం చేశాడు. కళాకారులతో పరిచయం పెంచుకున్నాడు.

ఎంతో నైపుణ్యం ఉండి కూడా పొట్ట గడవని స్థితిలో ఉన్న కళాకారులెందరో కలిశారు. వారి పూర్వీకులనుండి వారసత్వం గా అందిపుచ్చుకున్న కళారీతులను యథాతథంగా వాడటం వల్ల లాభ దాయకంగా లేదని గ్రహించాడు. ఆ క్షణానే ఫంకీ కళాకార్ ఆవిర్భావం జరిగింది. 'మా సంస్థ బ్యాగులు, పాదరక్షలు, ఉలెన్ దుస్తులే కాదు, ఆట వస్తువులను కూడా తయారుచేస్తుంది.



ఉలెన్ వస్తువుల తయారీకోసం నగ్గర్ (హిమా చల్ ప్రదేశ్) గ్రామానికి చెందిన స్వయం సహాయక బృందం (సెల్ఫ్ హెల్ప్ గ్రూప్)కు చెందిన 12మంది మహిళలను మా సంస్థలో భాగస్వాములను చేశాం. దీని వల్ల ఆయా కుటుంబాలు పేదరికంలో మగ్గకుండా చేయటం, అక్కడి మహిళా కళాకారులను సాధికారిక మహిళా

వ్యాపారవేత్తలను చేయటమే మా లక్ష్యం. ఆయా వస్తువుల తయారీలో వాడే రంగులకు ప్రకృతి సిద్ధంగా లభించే వనమూలికలు, పూలు, కొమ్మలు, వేళ్లను సేకరించి, వాటి నుంచి రంగులను గ్రహిస్తాము. దీనివల్ల వినియోగదారులకు ఎటువంటి అలర్జీలు ఉండవు, పర్యావరణహితంగాను ఉంటాయి.

'ఫంకీ కళాకార్' తోలు వస్తువులను కూడా తయారు చేస్తారు. వాటిపై చేతో ఢిల్లీ, యుపి, బీహార్‌లకు చెందిన కళాకారులు మధుబని పెయింటింగ్‌ని వేస్తారు. 'ఫంకీ కళాకార్' తయారుచేసే పాదరక్షలలో ఓ ప్రత్యేకత ఉంది. డిజైన్లను కాటన్‌పై అజ్రక్ టెక్నిక్‌తో బ్లాక్ ప్రింట్ చేస్తారు. పాదరక్షల అడుగుభాగానికి స్క్రాప్ టైర్లను వాడతారు. 'ముంబైలోని మా ప్రొడక్షన్ యూనిట్ ఇందుకోసం స్థానికంగా ఉన్న చెప్పులుకుట్టే నలుగురికి ఉద్యోగాలు ఇచ్చింది. మెషిన్లపై తయారయ్యే బ్రాండెడ్ పాదరక్షలు ఎక్కువవటంతో పాదరక్షల తయారీదారులు జీవనోపాధిని కోల్పోయి అల్లాడుతున్నారు. మేం చేసింది కేవలం నలుగురికి ఉద్యోగం ఇవ్వటం కాదు..నాలుగు కుటుంబాలకు



ఆసరా కల్పించటం' అంటారు అమి.

ఫంకీ కళాకార్, సృజన అనే మరో ప్రభుత్వేతర సంస్థను కూడా భాగస్వామిని చేసింది. సృజనలోని మహిళలు కాటన్ బ్యాగ్‌లను తయారుచేస్తారు. అంతేకాకుండా క్లాసిక్ బోర్డ్ గేమ్‌లయిన చదరంగం, వైకుంఠపాళి వంటివి కూడా తయారుచేస్తుంది. ఇందుకోసం ఫంకీ కళాకార్ కళా రక్షా సంస్థను కూడా కలుపుకున్నారు. ఈ సంస్థ సంప్రదాయ కళల పరిరక్షణ లక్ష్యంగా గుజరాత్‌లోని సుమ్రసర్‌కు చెందిన మహిళలకు ఉపాధి కల్పిస్తోంది. చెస్ పీస్‌లను మిగిలిపోయిన వస్త్రాల ముక్కలతో అందంగా తయారుచేస్తారు. భారత్‌లోని నలుమూలల ఉన్న కళాకారుల సహకారంతో వస్తూత్పత్తి చేయడమేగాక, యు.కె.లోని కెంట్‌కు చెందిన టాన్‌బ్రిడ్జ్ స్టూడియోను కూడా నడుపుతోంది. ఫంకీ కళాకార్ టీమ్ ఇటీవల నాటింగ్ హిల్ (లండన్)లో ఓ కాన్సెప్ట్ స్టోర్‌ను తెరిచింది. ఫెయిర్‌ట్రంక్‌తో కలిసి ఇండియన్ మార్కెట్లోకి కూడా త్వరలో ప్రవేశిస్తోంది. అమి అల్వి ప్రేరణతో మరెంతో మంది ఈ విధమైన కృషి సాగించినప్పుడే దేశీయ కళలు కళకళలాడతాయి. ■

# బఫూన్ బొమ్మల భలే యిల్లు



ఇంటి అందాన్ని పెంచే బొమ్మలు ప్రతి ఇంట్లో ఎన్నో కొన్ని ఉండటం సహజమే. కానీ ఎటు చూసినా వందలాది బొమ్మలు.. అదీ ఒకేరకం బొమ్మలు కొలువుతీరటం విశేషమే కదూ.

అంటారియో (కెనడా)లో ఇటీవల ఓ భవంతి అమ్మకానికి పెట్టారు. ఆ యిల్లు బయటినుంచి చూస్తే సాధారణ ఇల్లులాగే ఉంటుంది. చక్కటి లాన్, ఆపైన వరండా వగైరా..వగైరా. లోపలికి అడుగుపెడితే అదో విచిత్రలోకం. ఎటుచూసినా వందలాది క్లౌన్ బొమ్మలు (బఫూన్ బొమ్మలు) అందంగా, పొందిగ్గా సర్ది ఉంటాయి. కుర్చీల్లో కూర్చుని ఉండేవి కొన్నయితే, పడకలపై విశ్రాంతిగా పరుండేవి మరికొన్ని, ఊయలలో ఊగేవి కొన్ని, షెల్ఫ్‌లలో తిష్ట వేసేవి ఇంకొన్ని. కడ్లీ క్లౌన్స్‌తోపాటు పార్సిలిన్ క్లౌన్స్, బైక్ నడిపేవి, క్లౌన్ మాగ్నెట్లు, రొనాల్డ్ మాక్‌డొనాల్డ్ క్లౌన్స్, క్లౌన్ ఆర్ట్ వర్క్‌లు, క్లౌన్ వాల్ పేపర్, డైనింగ్ రూమ్‌లో మూలన బట్లర్‌లాగా నిలుచుండే క్లౌన్ స్టాట్యూ. క్యాబినెట్ల నిండా క్లౌన్లే క్లౌన్లు. ఈ భవంతిలో మొత్తం 1,500 క్లౌన్స్ ఉన్నాయట. ఆ ఇంటి ఇల్లాలు మైఖేల్ మాక్‌మానిస్‌కు క్లౌన్స్ సేకరణ పెద్ద హాబీ. అందువల్లే ఆవిడ గత పాతికేళ్లుగా తనకు నచ్చిన క్లౌన్స్‌ను అదేపనిగా కొని, ఇంట్లో కొలువుతీర్చింది. అయితే ఆమె కొడుక్కి మాత్రం ఆ క్లౌన్ బొమ్మల పట్ల ఏమంత ఆసక్తిలేదు. చీప్‌గా ఉన్నాయి కదాని కొనేసి ఉంటుందం టాడట. మరి ఇల్లు అమ్ముడుపోయాక ఆ క్లౌన్ బొమ్మలన్నిటినీ వెంట తీసుకెళతారా అన్న ప్రశ్నకు కొన్నింటిని మాత్రమే తీసుకెళతామని బదులిచ్చారట. ■








# మిస్ కావద్దు...

– కోనే నాగ వెంకట ఆంజనేయులు

**రోజూలాగే** ఆ రోజూ రాత్రి ఎనిమిదయ్యే సరికి మా అబ్బాయి దగ్గర్నుండి రాబోయే ఫోన్ కాల్‌కోసం ఎదురుచూడ సాగేను. మా ఆవిడ వంటిల్లు చక్కబెట్టు కుంటోంది. మా మనవరాలు కీర్తి టి.వి.లో కార్టూన్ ఛానల్స్ మార్చి మార్చి చూడడంలో నిమగ్నమై పోయి ఉంది. రోజూ రాత్రి ఎనిమిదయ్యేసరికి నేను టిఫిన్ చెయ్యడం పూర్తయిపోతుంది. మా వాడితో నేను, వాళ్లమ్మ, వాడి కూతురు ఫోన్ మాట్లాడిన తరువాత కొద్దిగా పెరుగన్నం తిని కాసేపు టి.వి. చూసి పది గంటలకల్లా మంచం ఎక్కేస్తుంటాను. ఎనిమిది దాటి మూడు నిమిషాలైన తరువాత ఫోన్ రింగయింది. రోజూలాగే నేను నా సెల్‌ఫోన్ ఎత్తి స్పీకర్ ఆన్ చేశాను. వంటింట్లో పని ఆపేసి మా ఆవిడ సోఫాలో నా పక్కకి చేరిపోయింది.

"నాన్నగారూ! ఎలా ఉన్నారు? రోజూ వాడు అడిగే మొదటి ప్రశ్న అడిగేడు.

"అంతా బాగున్నాం నాన్నా!" అన్న నా రొటీన్ సమాధానం విన్న తరువాతే యింకేమైనా మాట్లాడుతాడు వాడు.

"ఎలా ఉంది మీ మనవరాలు?" వాడి కూతురి గురించి అడిగేడు కుతూహలంగా.

"దానికేం చక్కగా ఉంది. రోజూ స్కూల్‌కి వెళుతుంది. రాగానే డ్రెస్ కూడా మార్చుకోకుండా హోమ్ వర్క్ చేసేసు కుంటుంది. తిండి దగ్గరే కాస్త పేచీ పెడుతుంది. దాన్ని గురించి మీరేమీ బెంగ పడకండి" చెప్పేను. 'మీరు' అంటే వాడూ, వాడి భార్య అని.

నాతో ఆ మాటా ఈ మాటా మాట్లాడిన తరువాత కాసేపు వాళ్లమ్మతో మాట్లాడేడు. కోడలు కూడా వాళ్లత్తగారితో కాసేపు యోగక్షేమాలు మాట్లాడింది.

"కీర్తికొకసారి యివ్వండి ఫోన్" ఫోన్ నేను తీసుకున్న తరువాత అడిగేడు మా అబ్బాయి.

"అమ్మా! నాన్నతో మాట్లాడు" అంటూ ఫోన్ సీరియస్‌గా పోగో చూస్తున్న కీర్తికి అందించబోయాను.

"కార్టూన్ చూస్తున్నాను కదా తాతయ్యా! తరువాత మాట్లాడతానని చెప్పండి" టి.వి. మీద నుండి కళ్లు తిప్పకుండానే చెప్పింది కీర్తి. కాసేపు తరువాత మాట్లాడుతానంటే 'మాట్లాడను' అని అర్థం. అదే చెప్పేను, వాళ్ల నాన్నకి. నిరాశపడ్డాడు వాడు.

"ఏమిటి నాన్నా? దానికోసం ఫోన్ చేస్తే మాట్లాడదేంటి?" కాస్త చిరాకు పడ్డాడు వాడు.

నేనేమీ సమాధానం చెప్పలేదు. తనకి యిష్టం ఉంటేనే వాళ్ళమ్మ, నాన్నలతో మాట్లాడుతుంది తప్పితే మనం కోరి అడిగితే మాట్లాడదు కీర్తి. తరువాత అడిగి చాలా రోజులు కావడంతో నేను వారం పది రోజులకొకసారి అడిగే ప్రశ్న అడిగేను మా అబ్బాయిని.

"అది సరేరా! నీ కూతుర్ని ఆరు నెలల పాపగా ఉండగా మా దగ్గర వదిలేరు. ఇప్పుడది ఫస్ట్ స్టాండర్డ్‌లోకి వచ్చింది. ఏ నాలుగైదు నెలలకో ఓ పూట వచ్చి దాన్ని చూసి అదేరోజు సాయంకాలానికి వెళ్లిపోతున్నారు తప్పితే దాన్ని మీ దగ్గరకు తీసుకువెళ్లే ప్రయత్నం చెయ్యడం లేదు. ఇంకెన్నాళ్లు ఉంచుతార్రా దాన్ని మా దగ్గర? మీ దగ్గరకు తీసుకువెళ్లరా?"

అసలే కూతురు తమతో మాట్లాడలేదని ఫీలవుతున్న వాడికి నా ప్రశ్న యింకా చిరాకు తెప్పించినట్లుంది.

"ఏం నాన్నగారూ! మీ మనవరాలిని మీ దగ్గర ఉంచుకోవడం మీకు యిష్టం లేదా? అది మీకు భారమైపోయిందా? నేను, మీ కోడలూ యిద్దరం ఉద్యోగాలకు వెళ్లిపోతే దానిని చూసుకోవడానికి ఎవరూ లేరనే కదా మీ దగ్గర వదిలేం. అప్పుడు మీరు కూడా తన పెంపకాన్ని ఆనందంగానే స్వీకరించారు కదా! ఇప్పుడు తనను మీ దగ్గర ఉంచుకోవడం మీకు కష్టంగా ఉందా? తీసుకుపోతాంలెండి. మా బాధలు మేం పడతాం" అంటూ విసురుగా ఫోన్ కట్ చేశాడు.

* * *



నేను స్టీల్ ప్లాంట్‌లో మేనేజర్‌గా చేసి రిటైరయ్యాను, మూడేళ్ల క్రితం. ప్లాంట్‌కి దగ్గర్లోనే స్వంత ఇల్లు కట్టుకుని ఉంటున్నాం. నా కొడుకూ, కోడలూ ఉద్యోగాల రీత్యా హైదరాబాద్‌లో ఉంటున్నారు. ఇద్దరూ చెరో ప్రయివేట్ కంపెనీలో ఉద్యోగాలు చేస్తున్నారు. ఇద్దరూ సంపాదిస్తేనేగానీ గడవని రోజులు కదా ఇవి. అందులోనూ ఆడపిల్ల తల్లిదండ్రులు కదా!

బిడ్డ పుట్టిన తరువాత ఉద్యోగం మానేద్దామనుకున్న మా కోడలు– పుట్టింది కూతురు కావడంతో నెలకు అరవై వేల రూపాయలు వచ్చే ఉద్యోగం వదులుకోవడానికి ఏమాత్రం యిష్టపడలేదు. ఇద్దరూ ఉద్యోగాలకు వెళ్లిపోతే పాపని చూసుకోవడానికి ఎవరూ లేరని పాపని ఆరు నెలల వయసప్పుడే తనని మా దగ్గర వదిలేశారు. మా కోడలు తల్లిదండ్రులు అమెరికాలో ఉన్న వాళ్ల అబ్బాయి దగ్గర ఉంటారు. అందుకే పాపను చూసుకునే బాధ్యత పూర్తిగా మాదే అయింది. పోనీ నా రిటైర్‌మెంట్ తరువాత మేం హైదరాబాద్ వెళ్లిపోయి నా కొడుకు, కోడలు దగ్గరే ఉందామన్నా నా మీద నా దగ్గరే ఉన్న వయసుడిగిన నా తల్లిదండ్రుల్ని చూసుకోవలసిన బాధ్యత కూడా ఉంది. సర్వీస్‌లో ఉన్నంత కాలం ఇరుకిరుకు అద్దె ఇళ్లల్లో గడిపిన మేం ఇప్పుడు విశాలమైన మా స్వంత ఇంట్లోనే మా శేష జీవితం గడపాలనుకోవడం కూడా మేం హైదరాబాద్, మా అబ్బాయి దగ్గరకు వెళ్లకపోవడానికి మరో కారణం.

మా మనవరాలికి మాటలు రావడం, అన్నప్రాశన, అక్షరాభ్యాసం, ఆటలు, పాటలు అన్నీ మా దగ్గరే! ఆయా ఫంక్షన్స్‌కి, వాళ్ల అమ్మా, నాన్నలు మిగతా చుట్టాల్లాగే వచ్చి వెళ్లిపోయేవారు.

మా అమ్మాయి మా అబ్బాయికంటే చిన్నది. తనకి త్వరగా పెళ్లయిపోయి ప్రస్తుతం ఢిల్లీలో ఉంటోంది. మా అల్లుడు ఎయిర్‌ఫోర్స్ ఉద్యోగి. వాళ్లకిద్దరూ మగపిల్లలే. ఒకడికి పన్నెండేళ్లు. రెండోవాడికి పదేళ్లు. మా అమ్మాయి కూడా టీచర్‌గా ఉద్యోగం చేస్తోంది ఢిల్లీలోనే. తన అత్తగారు తన దగ్గరే ఉండడంతో పిల్లల్ని చూసుకోవడానికి వాళ్లకి ఏ యిబ్బందీ లేకపోయింది. పిల్లలిద్దరినీ ఆవిడ ఎంతో బాధ్యతాయుతంగా చూసుకుంటారు.

* * *

మా అబ్బాయి కోపంతో ఫోన్ పెట్టేసిన తరువాత ఎప్పుడు ఫోన్ చేసినా ముక్తసరిగా మాట్లాడడం మొదలుపెట్టేడు. దాంతో వాడికి సంజాయిషీ యివ్వవలసిన బాధ్యత నాపై ఉందనిపించింది. నేనెందుకలా అనవలసి వచ్చిందో వాడికి వివరంగా చెప్పాల్సిన తరుణం వచ్చిందనిపించింది. ఇదంతా ఫోన్‌లో చెప్పలేననిపించి వాడి పేరున ఉత్తరం రాయడం మొదలుపెట్టేను.

డియర్ రాజేష్!

ఇదేమిటి? నాన్నగారు రోజూ ఫోన్‌లో మాట్లాడుతూనే ఉన్నారు కదా! ప్రత్యేకంగా ఉత్తరం రాయవలసిన అవసరమేమొచ్చింది? అని కంగారుపడకు, ఆశ్చర్యపడకు. నీతో కొన్ని విషయాలు పంచుకోవాలనే ఈ ఉత్తరం రాస్తున్నాను. ఫోన్‌లోనైతే నా భావాలను విపులంగా విశదీకరించలేనేమోనన్న అనుమానంతో ఈ ఉత్తరం రాయడానికి పూనుకున్నాను.

నీ కూతురికి రెండేళ్ల వయసున్నప్పుడు ఓ రోజు ఏం జరిగిందో తెలుసా? నేను, నీ కూతురూ అలా పార్క్ వైపు షికారుగా వెళుతున్నాం. మాట్లాడుతూ, మాట్లాడుతూ కీర్తి సడన్‌గా "తాతయ్యా! ఆగండి" అంది గాబరాగా. నేను ఆగేను. కింద చూస్తే పేడ. కాస్త ఉంటే నా కాలు పేడలో పడి ఖరాబు అయి ఉండేది. నీ కూతురు నా కాలు పేడలో పడకుండా ఆపిందేమో! అనుకున్నాను. కానీ–

"తాతయ్యా! నువ్వుగానీ ఆ పేడ తొక్కివుంటే"– నా పేడ తొక్కేరు అని ఆవు కోప్పడుతుంది తెలుసా?" అంది కళ్లు ఇంత పెద్దవి చేస్తూ. నాకెంత నవ్వొచ్చిందో తెలుసా? అదే సమయంలో ఆశ్చర్యం కూడా కలిగింది, తన ఆలోచనకు. ఈ విషయం మీ అమ్మకి చెబితే పడీ పడీ నవ్వింది.

ఆ మధ్యన మనం ఉంటున్న కింది పోర్షన్ అద్దెకిచ్చేసి మా కాపురం పైకి మార్చేం కదా! నువ్వు కొనిచ్చిన ఎల్ఇడి టి.వి.లో కార్టూన్ నెట్‌వర్క్ ప్రోగ్రామ్‌లు చూస్తూ "తాతయ్యా! కింది టి.వి.లో కార్టూన్లన్నీ ఈ పై టి.వి.లోకి ఎలా వచ్చాయి?" అని ఆశ్చర్యం ప్రకటించిందోరోజు నీ కూతురు.

ఎంత ఆశ్చర్యం కలిగిందో తన ఆలోచనా ధోరణికి. ఇంటికి వచ్చిన వాళ్లందరికీ ఈ విషయం చెప్పి వాళ్ల నానమ్మ ఎంత మురిసిపోతుందో తెలుసా? ఇలా చెప్పిన ప్రతిసారీ దానికి దిష్టి తీయకుండా ఉండదు మీ అమ్మ. ఈ మధ్యన తనని తీసుకుని కృష్ణా పుష్కరాలకు వెళ్లాం కదా. రైల్లోనుండి అందరూ కృష్ణా నదిలోకి డబ్బులు వేస్తుంటే తనకి కాకి, కుండలో నీళ్లు, రాళ్ల కథ జ్ఞాపకం వచ్చినట్లుంది "తాతయ్యా! అందరూ నీళ్లల్లో డబ్బులు వేస్తుంటే నీళ్లు పైకి వచ్చేస్తాయేమోనంది" ఆందోళనగా. అక్కడున్న వాళ్లందరూ ఫక్కున నవ్వేరు, తన మాటలకు.

అన్నట్లు జర్మనీలో ఉన్న మీ పెద్దమ్మ కూతురు రేణు మొన్న ఆదివారంనాడు ఫోన్ చేసింది. తన కొడుకు పూజిత్‌కిప్పుడు నాలుగేళ్లు నిండేయి. వాళ్లకు జర్మనీలో మామిడిపళ్లు ఎప్పుడోగానీ దొరకవట. ఓ సూపర్ బజారులో అపురూపంగా దొరికిన ఒకే ఒక మామిడిపండు కొని దేవుడికి నైవేద్యం పెట్టిందట వాళ్లమ్మ.

"అది నీకే! స్కూల్ నుంచి వచ్చిన తరువాత తిందువుగాని" అని చెబితే వాడు ఆనందంగా స్కూల్‌కి వెళ్లేడట. స్కూల్ నుంచి తిరిగి వచ్చిన వాడు పుస్తకాల సంచీ విసిరేసి దేవుడి గది తలుపు తెరిచి చూసేసరికి అక్కడ మామిడిపండు లేదట.

"అమ్మా! దేవుడు నా మామిడిపండు తినేశాడే!" అని పాపం వాడు గోడు గోడున ఏడుపు లంకించుకున్నాడట. అప్పుడు వాళ్లమ్మ నవ్వుతూ ఫ్రిజ్‌లోంచి మామిడిపండు తీసి వాడికి యిచ్చిందట. అప్పుడు వాడు ఏడుపు ఆపేడట. ఈ సంగతి చెప్పి వాళ్లమ్మ, నాన్న ఒకటే నవ్వు. ఇక్కడ మాకు నవ్వాగలేదు. వాడి మాటలకు.

కిందటి నెలలో మీ మామయ్య కొడుకు దీపూ వాళ్లమ్మ నూతన గృహప్రవేశానికి బెంగళూరు వెళ్లేం మేం. ఆ అపార్ట్‌మెంట్‌లో వాళ్ల పోర్షన్ మూడో అంతస్తులో ఉంది. ఆ అపార్ట్‌మెంట్‌కి మిగతా మూడు వైపులా మరో మూడు అపార్ట్‌మెంట్స్ ఉన్నాయి. అంటే నాలుగు అపార్ట్‌మెంట్స్ చతురస్రాకారంలో ఉంటాయన్నమాట. మధ్యలో కామన్ స్విమ్మింగ్ పూల్ ఉంది.

గృహప్రవేశం అయ్యాక మేమంతా ఇల్లు చూస్తున్నాం. మీ మామయ్య కొడుకు ప్రవీణ్ కూతురు మూడేళ్ల నిక్కీ బాల్కనీలోంచి కింద ఉన్న స్విమ్మింగ్ పూల్‌ని చూపిస్తూ "అరే! బీచ్‌ని ఎవరు కింద పడేశారు?" అంది ఆశ్చర్యంగా. గృహ ప్రవేశానికి వచ్చినవాళ్లందరు ఆ చిన్నారి మాటలకు ఫక్కున నవ్వి చప్పట్లు కొడుతుంటే తను కూడా అయోమయంగా చప్పట్లు కొట్టేసింది.

వాళ్లమ్మ దాన్నెత్తుకుని ఎన్ని ముద్దులు కురిపించిందో తెలుసా? వాళ్ల నాన్నయితే సంబరం పట్టలేకపోయాడు తన కూతురి మాటలకు. ఇప్పటికీ ఇంటికి వచ్చినవాళ్లకీ మాటలు చెప్పి మురిసిపోతుంటారట వాళ్లమ్మ, నాన్నలు. ఇంతెందుకు? మీ చెల్లి చిన్న కొడుకు నీ మేనల్లుడు నందుని వాడికి మూడేళ్లప్పుడు వాళ్లమ్మ, నాన్న మొదటిసారి థియేటర్‌లో సినిమాకి తీసుకువెళ్లినప్పుడు తెరమీద బొమ్మని చూడగానే వాడు "బాబోయ్! ఎంత పెద్ద టి.వి.నో" అని అరిచాడట. ఆ మాటలు విన్నవాళ్లమ్మ, నాన్నలతోపాటు హాల్లో చుట్టుపక్కల సీట్లలో ఉన్నవాళ్లు కూడా పెద్ద పెట్టున నవ్వేశారట. పాపం అప్పటివరకూ వాడు టి.వి.లోనే కదిలే బొమ్మలు చూసి చూసి ఒక్కసారిగా పెద్ద తెరమీద కదిలే బొమ్మలు చూసేసరికి వాడికి అది పెద్ద టి.వి.లా అనిపించిందన్నమాట. వాడే అప్పట్లో వాళ్ల ముఖం వైపు టి.వి. రిమోట్ పెట్టి బటన్లు నొక్కుతూ "నీ ముఖం మార్చేస్తున్నాను మమ్మీ" అనేవాడు. వాళ్లమ్మ పెట్టిన బెల్లం ముక్క తిని "ఎంత బాగా వండేవు మమ్మీ" అనేవాడు.

నీ పెద్ద మేనల్లుడు సిద్దు చిన్నప్పుడు వాళ్లమ్మతో మనింటికి వచ్చినప్పుడు మీ అమ్మ వాడికి రోజూ దేవుడి పూజలు, హారతులు అలవాటు చేసింది. రోజూ వాడు మీ అమ్మతోపాటు దేవుడి గదిలో పూజలు చేసి, హారతులు కళ్లకద్దుకునేవాడు. అప్పటినుంచీ వాడు ఎక్కడ హారతి కనబడినా చివరికి టి.విలో హారతి కనబడినా కళ్లకు అద్దుకోకుండా ఉండేవాడు కాదు.

వాడిని నేనోసారి మన సాయంకాలం సంతకి తీసుకువెళ్లాను. మార్కెట్‌లో చేపలమ్ముకునే వాళ్లదగ్గర చిన్న కిరసనాయిల్ వత్తి దీపాలుంటాయి కదా! వాడు ఆ మంటని హారతిలా భావించి కళ్లకు అద్దుకు న్నాడు ఎంతో భక్తిభావంతో. సంతలో చేపలు కొనడానికి వచ్చినవాళ్లు యిది చూసి ఎంతో నవ్వుకున్నారు. వాడిని నేనెప్పుడు సంతకు తీసుకువెళ్లినా యిదే తంతు. వాడి చేష్టలుచూసి ముచ్చటపడి ఆ చేపలమ్ముకునేవాళ్లు మాకు కాస్త చవగ్గా చేపలు యిచ్చేవాళ్లు. మేం యిప్పటికీ వాడి చిలిపి చేష్టల్లో యిదీ ఒకటిగా ఎంచి అందరికీ చెప్పి నవ్విస్తుంటాం. నేను నా చిన్నప్పుడు చదివిన ఓ సంఘటన ఇప్పటికీ ఎంతో ఆహ్లాదపరుస్తుంటుంది. వాన వెలిసిన తరువాత రోడ్డుమీద ఏదో మోటారు వాహనం తాలూకు ఆయిల్ నీళ్లతో కలిసి రంగు రంగులు సృష్టించినప్పుడు అక్కడే బస్ స్టాపులో ఉన్న ఓ చిన్న కుర్రాడు వాళ్లమ్మతో "అమ్మా! చూడవే! ఇంద్రధనుస్సు కింద పడి ముక్కలయిపోయిందే" అని చాలా బాధపడ్డాట్ట. ఎంత అందమైన ఊహ కదూ!"

ఇంకా నీ కూతురు గురించి చెప్పాలంటే–

పనిమనిషిని అంట్లు 'తెల్లగా' తోము అంటుంది.

చాకలిని బట్టలు 'తెల్లగా' ఉతుకు అంటుంది.

అదేవిధంగా ఇల్లూడ్చే పిల్లని యిల్లు 'తెల్లగా' ఊడు... అంటుంది.

మొన్నోసారి వాళ్ల నానమ్మ కొన్న కొత్త రింగులు చెవులకి పెట్టుకుని మురిసిపోతూ అంట్లు తోముతున్న పనిమనిషి అప్పాయమ్మ దగ్గరకు వెళ్లి "నా రింగులు బాగున్నాయా?" అని అడిగింది.

"చాలా బాగున్నాయమ్మా!" నాకిస్తావా నీ రింగులు" అని ఆవిడ అడిగితే–

అది ఆవిడకేసి విచిత్రంగా చూసి "నీకెందుకు? నువ్వు అప్పాయమ్మవా? గర్ల్‌వా?" అని అడిగింది.

ఎంత నవ్వుకున్నామో తెలుసా? ఆ మాటలకు.

ఇంకోసారి పక్కింటి మామ్మగారు మీ అమ్మతో మాట్లాడుతూ "కడుపులో గడబిడగా ఉంది. నిన్న చాలా చల్లమిరపకాయలు తిన్నాను" అని చెబితే దానికి నీ కూతురు "అందుకే చల్లమిరపకాయలు తినకూడదు మామ్మగారూ! వేడి మిరపకాయలు తినాలి" అంది పెద్ద ఆరిందాలా.

తనకి అన్నం పెడుతూ "ఒక్క మెతుకు కూడా వదలకుండా తినాలి" అని చెబుతుంటుంది మీ అమ్మ. అలాగే ఒక్క మెతుకు కూడా వదలకుండా తినేసి "నానమ్మా! చూడు ఒక్క మెతుకు కూడా వదల్లేదు" అంటుంది. ఉప్మా తిన్నా, ఇడ్లీ తిన్నా, పెసరట్టు తిన్నా, చివరికి చపాతీ తిన్నా కూడా ఒక్క మెతుకు కూడా వదలకుండా తినేశా" అనే అంటుంది ఖాళీ ప్లేటు చూపెడుతూ. స్కూల్‌కి వాటర్ బాటిల్‌నిండా నీళ్ల తీసుకువెళుతుంది. అయినాసరే నీళ్ల సరిపోవడం లేదు అంటుంది. ఒకోసారి సీసాడు నీళ్లూ ఇంటికి తిరిగి తీసుకు వచ్చేసి ఇంకా సరిపోలేదంటావేం?" అని ఆశ్చర్యంగా అడిగితే "అయినాసరే సరిపోలేదు నానమ్మా" అనే అంటుంది.

కాళ్లకి పారాణి పెట్టినప్పుడు "అదేమిటి?" అని అడిగితే– "మీ అమ్మ చేసే సాయి పారాయణానికీ, దీనికి లింకు పెట్టి "పారాయణం" అని చెబుతుంది. మల్లెపూల దండ తీసుకువస్తే ఆ దండ తన చిట్టి జడ పొడవునా వేలాడాల్సిందే. ఆ రోజు తలస్నానం, లంగా, ఓణీ కంపల్సరీ.

నేను "అయ్ లవ్ యూ" అంటే తను "అయ్ లవ్ యు టు" అంటుంది. నేను తిరిగి "అయ్ లవ్ యు త్రీ" అంటే తను "అయ్ లవ్ యు ఫోర్" అంటుంది. ఇలా ఇద్దరమూ హండ్రెడ్ వరకూ వెళ్లిపోతాం.

నేనోసారి అత్యవసరంగా ఊరు వెళ్లివస్తే ఎక్కడ విన్నదో ఏమో గానీ "నువ్వు లేనప్పుడు నిన్ను చాలా మిస్ అయ్యాను తాతయ్యా!" అంది. ఎంత పొంగిపోయానో తెలుసా?

నీకీపాటికి సందేహం వచ్చే ఉంటుంది– నాన్నగారు ఉత్తరంలో యివన్నీ చెబుతున్నారేమిటా? అని. దానికి కారణం ఉంది.

నాలుగు రోజుల క్రితం నేను నీతో మాట్లాడుతూ– "ఇంకా ఎంత కాలం మీ అమ్మాయిని మా దగ్గర ఉంచుతావురా? మీ దగ్గరకు తీసుకువెళ్లవా?" అని అడిగేను. ఆ మాటలకు నీకు కోపం కూడా వచ్చింది. మీ మనవరాలు మీకు భారమైపోయిందా?" అంటూ నిష్ఠూరంగా ఏవేవో మాట్లాడేవు. నిజమే! నువ్వన్నట్లు నీ కూతుర్ని మా వద్దకు తెచ్చుకుని పెంచడం మేం ఆనందంగానే భావించాం. తన చిలిపి చేష్టలూ, మాటలూ అన్నీ మేం ఆనందంగా ఆస్వాదిస్తున్నాం కూడా. ఆ ఆనందం తన తల్లిదండ్రులైన మీరిద్దరూ 'మిస్' అవుతున్నారన్న బాధతో నేనలా అన్నాను తప్పితే మా మనవరాలు మాకు భారం ఎప్పటికీ కాదు నాన్నా! దాన్ని పెంచడం మాకు బాధాకరం కూడా కాదురా!

పైన నేను చెప్పిన సంఘటనలు అన్నిటిలోనూ వాళ్ల పిల్లల చిలిపి చేష్టలూ, మాటలూ వాళ్ల అమ్మా, నాన్నలు స్వయంగా అనుభవించి ఆనందించి అందరితోనూ పంచుకుంటున్నారు. మీకు అలాంటి అవకాశం లేకపోయిందే! అన్నదే మా బాధ. మీ కూతురి చిలిపి పనులు, పలుకులు మీరు స్వయంగా అనుభవంలోకి తెచ్చుకుంటూ ఆ ఆనందానుభూతుల్ని మాతో పంచుకుంటే అది మాకు ఎంతో సంతోషం కలిగిస్తుంది. కానీ మీ విషయంలో అది రివర్స్ అవుతున్నది. దాని చిలిపి చేష్టలు మేం అనుభవించి మీకు ఫోన్‌లో చెబితే మీరు ఆనందపడుతున్నారు తప్పితే మీరు స్వయంగా అనుభవించడం లేదు. మీరు ప్రత్యక్షంగా ఆ ఆనందానుభూతుల్ని పొందాలనే మా ఆకాంక్ష. నీ కజిన్స్ అందరూ వాళ్ల పిల్లల చిలిపి చేష్టల్ని స్వయంగా అనుభూతి చెందుతున్నట్లు మీరూ ఆనందించాలనేది మా కోరిక.

స్కూల్ ఫంక్షన్స్‌లో నీ కూతురు చేసే డ్యాన్సులు, చిలిపి పనులు అన్నీ మేం స్వయంగా చూసి ఆనందించి వీడియో తీసి మీకు పంపితే మీరు చూస్తున్నారు తప్పితే మీరు ప్రత్యక్షంగా చూడలేకపోతున్నారన్నదే నా బాధ.

క్రికెట్ 'లైవ్' మ్యాచ్ చూడడంలో ఉన్న మజా 'రిపీట్ మ్యాచ్' చూడడంలో ఉండదని నీకూ తెలుసు కదా! మీరు మీ అమ్మాయి చిలిపి పనులు, 'లైవ్'లో చూసి ఆనందించాలిగానీ వీడియోలో 'రిపీట్'లా కాదు. 'స్కైప్'లో నీ కూతుర్ని చూసినా తనని తాకిన అనుభూతి పొందగలుగుతున్నారా మీరు?

మరో విషయం– నువ్వు గమనించే ఉంటావు... చాలా సార్లు బాధపడ్డావు కూడా. ఫోన్‌లోగానీ స్కైప్‌లోగానీ నీ కూతురు మీతో మాట్లాడడానికి ఉత్సాహం చూపించడం లేదు. మీరు వచ్చి వెళ్లిపోతుంటే బై చెబుతున్నది. కానీ మీరు వెళ్లిపోతున్నారన్న బాధ తనకి ఏమాత్రం ఉండడం లేదన్న విషయం మీకు తెలుసు. మీ కోసం మీ కూతురు తపించిపోవటం లేదన్న విషయం బాధాకరమే కదా! అది మీ దగ్గర పెరగడం లేదు కనుక తనకి మీపై ఆపేక్ష కలగడం లేదన్న విషయం గ్రహించండి.

ఈ బాధతోనే నేనా రోజు "నీ కూతుర్ని తీసుకువెళ్లవా?" అంటూ మాట్లాడేనని యిప్పటికైనా నువ్వు, నీ భార్య గ్రహిస్తే సంతోషం. మీ కూతురి బాల్యం ఇంకా చాలా మిగిలే ఉంది. దాన్నైనా మీరు సంతృప్తిగా అనుభవించాలన్నదే మీ నాన్న ఆకాంక్ష. దాన్ని మిస్ కావద్దు. నీ కూతురు స్వచ్ఛమైన చిరునవ్వులూ, ఆటపాటలూ ఆఫీస్ నుండి అలసిపోయి వచ్చిన మీకు ఎంత రిలీఫ్‌నిస్తాయో అనుభవిస్తేనే గానీ మీరు తెలుసుకోలేరు. అర్థం చేసుకుంటారనే ఆశతో.... మీ నాన్న.

ఉత్తరం పోస్ట్ చేసిన నాలుగు రోజుల తరువాత మా అబ్బాయితో ఫోన్‌లో మాట్లాడినప్పుడు వాడి స్వరంలో మార్పుని గమనించాను. వాడి మాటల్లో మృదుత్వం గమనించాను. అయితే నా లెటర్ చేరిందన్న మాట అనుకున్నాను. కానీ వాడు మాత్రం ఉత్తరం చేరినట్లు చెప్పలేదు. మరో నాలుగు రోజుల తరువాత నేను ఊహించినట్లుగానే వాడి ఉత్తరం నాకు చేరింది.

నాన్నగారికి...

మీ ఉత్తరం చేరింది. అన్ని విషయాలూ ఎంతో విపులంగా రాశారు. మీ కోడలు కూడా ఉత్తరం చదివి కళ్లనీళ్లు పెట్టుకుంది. మీ మాటలకు ఆ రోజున నేనూ ఆవేశపడిన మాట నిజం. మీ మీద కోపం తెచ్చుకోవడం, అలగడం కూడా నూటికి నూరు పాళ్లు నిజం. కానీ మీ ఉత్తరం చదివిన తరువాత నా ప్రవర్తనకి చాలా సిగ్గుపడ్డాను. నిజంగానే నేనూ, మీ కోడలూ మా అమ్మాయిని ఎంత మిస్ అవుతున్నామో గ్రహించాం. ఫోన్‌లో తను మాతో మాట్లాడడానికి యిష్టపడని రోజున ఎంత నరకం అనుభవించేవాళ్లమో మాకే తెలుసు. ఎంత కష్టమయినా, ఎన్ని ఇబ్బందులు ఎదుర్కోవలసి వచ్చినా మా అమ్మాయి బాల్యాన్ని యికపై మిస్ కాము. అది మా కోసం తపించిపోయేంత ప్రేమను దానికి మేం యిస్తాం. తన చిలిపి పనులన్నిటినీ మేం స్వయంగా అనుభవించి మీతో పంచుకుంటాం. నిజం. – రాజేష్

ఆ పై వారం మా అబ్బాయి, కోడలు వచ్చి వాళ్ల అమ్మాయిని వాళ్ల దగ్గర శాశ్వతంగా ఉంచుకోవడానికి తీసుకువెళ్లిపోయారు. నా మనవరాలు లేక మా ఇల్లు బోసిపోయినా– వాళ్ల అమ్మా, నాన్న పొందబోయే ఆనందాన్ని దృష్టిలో పెట్టుకుని ఈ మార్పుని కూడా మేం ఆనందంగా ఆహ్వానించాం.

■

## ఈ వారం కవిత్వం

# అనుబంధాలు

**బూట్లు** విప్పేదాకా తెలియదు
చినిగిన సాక్సుల్లోంచి
మడిమెలు తొంగిచూస్తూ
నాతో ఏదో చెప్పాలని.

బనియన్ సరే
చినుగులు బయట పడి
కొత్త డిజైన్లేర్పడి
దర్శనమిస్తున్నాయి

సగం విరిగినా
ప్యాంటు గుండీ
గట్టిగానే వుంది.
కాకపోతే
నాలుగు కండ్లకు బదులు
రెండు మిగిలాయి.

సాక్సులూ బనీనూ గుండీలు
నా వైపు ప్రేమగా చూస్తున్నాయి
ఇంత కాలం తోడుగా వున్నందుకు,
ఇంకా బైట పారెయ్యనందుకు.

– డా॥ ఎన్.గోపి

# స్ఫూర్తి

**చాలు** చాలు... అంటూ నీ శక్తికి
ఎందుకు సంకెళ్లు?
అందినది చాలదేమో అనుకుంటే
అత్యాశ
అడిగినది దొరకదేమో అనుకుంటే
తృప్తి

శ్వాసని చాలు చాలు అంటే....
ప్రాణం పోవడం గొప్పా?
గెలుపు, ఓటములు నీ
తలరాత కాదే....

కొండమీద వాన
కురిసినా....
జలపాతంగా మారినా...
కడకు కలిసేది కడలినే!
అది నది తలరాత కాదే....

కృషి ఉంటే..
మనుషులు ఎన్ని కష్టాలైనా దాటేస్తారు
ఆశపడొద్దు...
అని బుద్ధుడు చెప్పినా...
హద్దులు లేని ప్రేమను లక్ష్యంలో
నింపడంలో తప్పు లేదే!

సూర్యోదయం లేదని
వానని తిట్టుకుంటే ప్రకృతి
మారుతుందా?
వానచాటున హరివిల్లు
చూడగలిగే కళ్లు ఉంటే అద్భుతం
కాదా?
కడలి లోతుల్లో కుంగిపోయాక
అంతకంటే కిందికి చేరలేమే!
అలలాగా పైకి రావాలి మళ్లీ..

ఓటమి తర్వాత స్థానం గెలుపుదే
ఎప్పుడు
లెక్క కట్టలేని ప్రతిభే నీలో
ఉంటే
ఒకటికి, రెంటికి బేరాలాడే
మూర్ఖ వ్యాపారివా నీవు?

గెలుపు నీ శక్తి అని....
ఓటమి విధిరాత అని వంకలెందుకో!
మనోస్థైర్యంతో భయాన్ని
ఝుళిపించేయ్

ఆత్మవిశ్వాసమే నీ ఆయుధం....
ఆత్మగౌరవమే నీ ఆభరణం....
గమ్యమే నీ గురి.....
గెలుపే నీ ఊపిరి....
అందుకో అలుపుతోనైనా ఈ స్ఫూర్తిని!

– శృంగవరపు రచన

# బతుకుచిత్రం

ఏ పేదవాడి బతుకు
పుస్తకం తెరిచినా
ఏముంది–
దరిద్రం అనే మూడక్షరాలు తప్ప?

నిరుపేద నిఘంటువులో
రేపటిపై లేదు ఆశ
నేడు గడవటం పైనే ధ్యాస
ఎప్పుడో వచ్చే వెన్నెలే తప్ప
వెలుగన్నదే శూన్యం
పట్టెడు మెతుకులకే పాట్లు
కూటికోసం గూటికోసం
నిరంతర యానం– ఏ దాతో
రాల్చిన ఎంగిలి మెతుకులతో

ఏ నిశీధిలోనో
ముగిసిపోతుంది వర్తమానం
పేవ్‌మెంట్ మీద ప్రయాణం
పేదరికపు వంతెన నీడలో
జీవనం–

మన పాలకులు ఏలికలు
గీసిన పేదవాడి బతుకుచిత్రం

– సురేఖా భాస్కర్

# చెలి

**చెలి** చూపుల ప్రియ నీ పలుకుల
చిరునవ్వుల సిరుల
సఖీ నీ తలపుల
ప్రియా నీ బాసల
సుగంధపు జల్లుల
ఆస్వాదించనా నిత్యం ఆనందించనా

నిను నే తలచిన వేళ
నిను నే చూసిన వేళ
నా ప్రేమను నీకై పెంచిన ఇన్ని
రుతువుల
నా ఊసులు నా బాసలు నీకు తెలుప
నే దాచితిని

నను నీలోన నీ బాసలలోన
నను నీ కౌగిలిలోన
నీ ప్రేమతో నను బంధించిన
ఈ సమయాన
నాకే సొంతం అంబరం సృష్టిసంబరం

నీవు నేను కలసిన వేళ తొలి
రవికిరణాలు వాలిన వేళ
మన ప్రేమ మనలో
ఎదిగిన తీపి జ్ఞాపకాల వేళ
మన ప్రేమను మన బంధమును ఈ
సృష్టికి తెలుపను

మన జీవితాన మన పయనాన
మన గమ్యమును
చిరునవ్వుతో దీవించిన
ఈ సమయాన
మనకే సొంతం
అంబరం సృష్టి సంబరం

– తౌటం రమేష్

సింగిల్ పేజీ కథ

# కళాతృష్ణ

– వియోగి

**త్యాగరాజుకు** ఏం చేయాలో అర్థం కావడం లేదు. ఉన్న ట్టుండి అత్తమామలు దిగబడ్డారు. రాక రాక వచ్చారు. ఊరక రారు మహాత్ములని.. వారి ఊరినుండి కర్నూలుకు పెద్ద పనిమీదే వచ్చారు. మామగారికి ఈ మధ్య ఒంట్లో బాగుండటం లేదట. ఆ ఊరి ఆర్‌యంపీ డాక్టర్లు, చిన్న డాక్టర్లు ఆయనకు ఆరోగ్యాన్ని కలిగించలేక పోయారు. వారు తమదైన శైలిలో ఎన్నో మందులు గుప్పించారు కానీ రామేశ్వరం పోయినా శనేశ్వరం వదలనట్లు, డబ్బులు నీళ్లలా ఖర్చయినా అనారోగ్యం మటుకు ఆయన్ని పట్టుకు కూర్చుంది బంకలాగా.

మామగారికి సేవలు చేసి చేసి అత్తగారు కూడా సిక్కయిపోయింది. దానితో ఆ వూరి పెద్దలు పెద్ద బోడి సలహా యిచ్చారు– "మీ కూతురు, అల్లుడు కర్నూల్లో ఉంటున్నారు గదా, కర్నూలులో మంచి మంచి డాక్టర్లకు కొరతలేదు కదా, అక్కడ ధన్వంతరిలాంటి ప్రభుత్వ ఆసుపత్రే కాకుండా, కుబేరులు పెట్టిన పెద్ద పెద్ద ప్రయివేటు కార్పొ రేటు ఆసుపత్రులున్నాయి కదా! మీ కూతురు, అల్లుడు నాలుగు చేతుల్తో సంపాదిస్తున్నారు కదా, మీకు పైసా ఖర్చు లేకుండా బాగా చూసుకుంటారు, అక్కడికి పోండని". అలా సలహా యివ్వడమే కాకుండా ఆ వూరి పెద్దలు దగ్గరుండి బస్సెక్కించి మరీ పంపించారు, వీరిని అడగకుండా.

త్యాగరాజు, త్యాగరాణులు ప్రైవేటు కాలేజీల్లో లెక్చరర్లుగా వున్నారు. కానీ వారి భుజస్కంధాల పైనే కాలేజీలు నడుస్తున్నట్లుగా యాజమాన్యాలు ఎప్పుడూ విపరీతమైన పనుల భారాలు మోపుతూ ఉంటారు. సెలవుల్లో కూడా వారు సుఖపడడం యిష్టం లేనట్లు హోమ్ వర్కులు యిస్తూ ఉంటారు.

ఎన్ని బాధ్యతలు మోస్తున్నా త్యాగరాజుకు పాటలు పాడటం సరదా! అందునా శాస్త్రీయ సంగీతం పాడటం మరీ మరీ యిష్టం! తనలోని తృష్ణ చచ్చిపోకుండా ఉండాలని అప్పుడప్పుడు వేదికను ఎక్కుతూ ఉంటాడు. అతనిలోని కళాతృష్ణను, నైపుణ్యాన్ని గుర్తించినవాళ్లు అతనికి అప్పుడప్పుడు కచేరీలు చేసే అవకాశం యిస్తుంటారు. నిజానికి అతను యింకా ఎక్కువ సార్లు కచేరీలు చేయగలడు. కానీ సంగీతంతో బతికేవాడికి లెక్చరరు పోస్టు ఎందుకని కుళ్లుకుని అతనికున్న ఉద్యోగానికి కూడా కొందరు ఎసరు పెట్టే అవ కాశం ఉంది. అందుకే అతను తనకొచ్చిన అవకాశాలు కొన్ని తగ్గించు కుని, కాలేజీకి సెలవులున్నప్పుడు మాత్రమే తన సంసిద్ధత తెలియచేస్తూ ఉంటాడు.

అలా ఈసారి కూడా ఒక దేవాలయంలో దసరా సెలవులకు సరదాగా తను కచేరీ యివ్వడానికి ఒప్పుకున్నాడు. కచేరీ యిచ్చిన ప్పుడు త్యాగరాజు యింత యిమ్మని అడగడు. వాళ్లు యిచ్చింది సంతోషంగా పుచ్చుకుంటాడు. వాళ్లు యిచ్చింది తక్కువైనా, తను మటుకు తను తన వెంట తీసుకువెళ్లే సహకార వాయిద్యకారులకు తన జేబులోంచి డబ్బులు చెల్లిస్తూ ఉంటాడు. ఎందుకంటే ఆ బీద కళాకారులు కేవలం కళనే నమ్ముకుని బతుకుతున్నారు గదా, తనంటే లెక్చరరుగా బతుకుతున్నాడు కదాని అతని ఆలోచన. కాని పులిమీద పుట్రలాగా అత్తమామల రాకతో, వారిని ప్రభుత్వ ఆసుపత్రిలో చూపించడంలో, వారు రాసిన వివిధ రకాల పరీక్షలు చేయించ డంలో, యింకా వారిని ప్రముఖ క్షేత్రాలకు తీసుకుపోవడంలో సెల వులు హరించుకుపోతున్నాయి. తన సంగీత సాధనకు సమయం మిగలడం లేదు. దానికితోడు మామగారికి ఏదో గుండె సమస్య ఉందని, దానికి తొందరలోనే చికిత్స చేయాలని డాక్టర్లు చెప్పారు. బ్లాక్సు ఉన్నాయిట. కొందరు స్టంట్లు వేస్తే చాలంటున్నారు. కొందరు ఆపరేషన్ చేయాలంటున్నారు. ఇంకొందరు ఈ వయసులో ఆయన్ని ఎందుకు ఇబ్బంది పెడతారు, బతికినంత కాలం బతుకుతారు... వదిలెయ్యండని చెప్పారు జాలి పడిపోతూ.

దానితో త్యాగరాణికి, త్యాగరాజుకు మైండ్లు బ్లాంకు అయిపో యాయి. ఈ మూడులో తను కచేరీ యివ్వలేడు. ఇవ్వకపోతే ఆ దేవాలయంవారి నమ్మకం పోగొట్టుకున్నవాడు అవుతాడు. తనమీద నమ్మకం ఉంచి ఒక రోజు తనకోసం కేటాయించారు. ఇప్పుడు నావల్ల కాదంటే కార్య క్రమం రసాభాసా అవుతుంది. అర్జెంటుగా ఇంకే కార్యక్రమం ఫిక్సు చేసుకోలేరు. అందులో వారు ఈసారి ముందే చెప్పారు, ఈసారి ఏమీ ఇవ్వలేమని.. సారీ అని, ఫండ్స్ టైట్ అయ్యాయని. అమ్మ వారి సేవ కింద భావించి ఉచితంగా కచేరి చెయ్యమని. ఉచితంగా అంటే వారికి యింకో ప్రత్యామ్నాయం దొరకదు. అందరూ తనలా ఉదారంగా ఉండరు కదా కళ విషయంలో.

ఇంతలో త్యాగరాజు బుర్రలో మెరుపు మెరిసింది. తన కో–లెక్చరరు సుబ్బారావు ఎప్పుడూ తన కచేరీల గురించి ఏడుస్తూ ఉంటాడు. తనకు అటువంటి అవకాశాలు వస్తే ఒక ఊపు ఊపుతా నంటాడు. అతనికి కూడ సంగీత జ్ఞానం ఉంది. కానీ అతని మొహం చూసి ఏ సంస్థవాళ్లు అతన్ని కచేరీలకు పిలవరు. ఇంకేం! ఈసారికి తన బదులు అతనికి అవకాశం యిద్దామనుకున్నాడు. వెంటనే అతన్ని కలిసి ఫలానా రోజున ఫలానా దేవాలయంలో పాటలు పాడాలని చెప్పాడు.

"చూడు సుబ్బూ! వాళ్లేమీ యిచ్చుకోలేరు. అమ్మవా రికి ఉడతా భక్తిగా పాడు. ఇది నీకు సమాజంలో మంచి గుర్తింపు తెస్తుంది".

సుబ్బారావు ఎగిరి గంతేశాడు. కానీ "తనకంటూ ఒక ట్రూపు లేదని, పక్క వాయిద్యాలు ఎవరు వాయిస్తారని?" బోల్డు యిదైపోయాడు.

జాలిపడి తనతోపాటు రెగ్యులర్‌గా వచ్చే పక్క వాయిద్య కళాకారుల చిరునామాలు యిచ్చాడు. వారిని కలిస్తే తనకు సహకరించినట్లే సహకరిస్తారని చెప్పాడు. మీరు మీరు చూసుకోండని తన పనుల్లో పడిపోయాడు.

ఆ రోజు రానే వచ్చింది. సుబ్బారావు వీరలెవల్లో కచేరి చేశాడు. బాగానే పాడినట్లుగా వార్తలు వచ్చాయి కూడ. తన భజనపరులను కొందరిని పిలిపించి చప్పట్లు కొట్టించుకున్నాడు. రెండు రోజుల తర్వాత ఏడ్పు మొహంతో సుబ్బారావు త్యాగరాజును కలిశాడు. "గురూ! థ్యాంక్స్. నువ్వు నాకు మంచి అవకాశం యిప్పించావు. బాగా పాడాను. శ్రోతలు బాగా మెచ్చుకున్నారు. కానీ..." ఆగాడు.

"కానీ ఏంటి, యిప్పుడంతా రూపాయలేగా" త్యాగరాజు జోక్ చేశాడు.

"ఆ దేవాలయంవాళ్లు ఒక్క పైసా రాల్చలేదు. ఊరికే ఓ శాలువా కప్పి పంపించారు. నేనంటే కక్కుర్తి పడను. కానీ నా వెంట వచ్చిన వాయిద్యగాళ్లు ఊరుకుంటారా? వాళ్లకు ఆటోచార్జీలు, వాళ్ల ఫీజులు నేనే చెల్లించుకోవలసి వచ్చింది. నాకు రెండు వేలు ఖర్చయింది. ఇలా చేతిచమురు వదులుతుందని తెలిస్తే నేను కచేరి యిచ్చేవాడిని కాను. తొలి కచేరి యిచ్చానన్న ఆనందం ఒక పక్క, వాయిద్యగాళ్లకు డబ్బులు యివ్వడంతో ఆవిరి అయిపోయింది. అప్పటికీ నువ్వు యిస్తావని తప్పుకుందామని చూశాను. కానీ వాళ్లు నన్ను వదిలిపెట్ట లేదు" బాధగా చెప్పాడు ఏడ్పు మొహంతో.

త్యాగరాజు ఆశ్చర్యపోయాడు. నిజానికి సుబ్బారావు బాగా స్థితిమం తుడు. తనకంటే ఎంతో మంచి స్థాయిలో వున్నాడు ఆర్థికంగా. తన కళను ఎవరూ గుర్తించలేదని యిన్నాళ్లు వాపోయాడు. అవకాశం యిస్తే యిలా డబ్బు ఖర్చయిందని ఏడుస్తున్నాడు. అతని శ్రీమతి కూడా మంచి జాబ్ చేస్తున్నది.

త్యాగరాజు మండిపోయి పర్సు తెరిచి రెండు వేలు అతని చేతిలో పెట్టాడు ఏం మాట్లాడకుండా. అతని మొహం మతాబులా వెలి గింది."థ్యాంక్స్ గురూ! వచ్చే సంవత్సరం కూడా నాకు అవకాశం యివ్వు. ఈసారి దేవాలయం కమిటీతో చెప్పి నాకు కొంచెం ముట్టచెప్పించు" అంటూ వెనక్కి తిరిగి చూడకుండా వెళ్లిపోయాడు.

త్యాగరాజు నోరు తెరిచి చూస్తున్నాడు. ■

# 'నారము' అంటే ఏమిటి?

**'నారము'** అనగా నీరు అని అర్థం. ఒక గృహానికి/ గ్రామానికి నీటి ప్రవాహం- 1) వాయువ్యం నుండి ఈశాన్యానికిగానీ 2) ఆగ్నేయం నుండి ఈశాన్యానికిగానీ ఉండటం వాస్తు సమ్మతమైంది. ఈ విధంగా నీటి ప్రవాహాలున్న గృహానికి/ గ్రామానికి సత్ఫలితాలుంటాయని చెప్పబడింది.

అలాగాక ఒక గృహానికి లేదా గ్రామానికి దక్షిణంలో ఆగ్నేయం నుండి నైరుతికిగానీ (3) నైరుతి నుండి ఆగ్నేయానికిగానీ (4) నది, కాలువ, బోదె మొదలయినవి ప్రవహిస్తున్నట్లయితే నారి (నీరు) ప్రవాహ వేధ దోషం సంభవిస్తుంది. అలాగే గృహానికి నైరుతి నుండి వాయువ్యానికిగానీ (5) వాయువ్యం నుండి నైరుతికిగానీ (6) నీటి ప్రవాహాలు ఉన్నట్లయితే ఈ దోషం సంభవిస్తుంది.

గృహానికి/ గ్రామానికి పశ్చిమాన నైరుతి నుండి వాయువ్యానికి (5); ఉత్తరాన ఈశాన్యం నుండి వాయువ్యానికి (7) నీటి ప్రవాహాలున్నా ఈ దోషం కలుగుతుంది. 'నారి ప్రవాహ వేధ' దోషం వలన మృత్యువు, వంశ నాశనం మొ॥ తీవ్ర దుష్ఫలితాలుంటాయని వాస్తు గ్రంథాల్లో పేర్కొన్నారు. అయితే, పైన పేర్కొన్న ప్రభావాల్లో కొన్ని మాత్రమే తీవ్రమైన దోషాలు, మరికొన్ని అంత తీవ్రమైనవి కావు.

ఉదా: (5) నైరుతి నుండి వాయువ్యానికి ఉన్న ప్రవాహాలు, (3) నైరుతి నుండి ఆగ్నేయానికున్న ప్రవాహాలు, భూమి(క్షేత్రం) ప్రకృతిసిద్ధంగా తూర్పు పల్లం లేదా ఉత్తర పల్లం అయినప్పుడే (3.5) ప్రవాహాలు ఏర్పడతాయి. అందుకని గృహానికి/ గ్రామానికి పశ్చిమ, దక్షిణ దిక్కుల్లో ప్రవాహం ఉండటం తీవ్రమైన దోషమైననూ ప్రవాహ గతి తూర్పు, ఉత్తర దిక్కులకు ఉండటంచేత తీవ్రమైన చెడు ఫలితాలను కలిగించవు. గృహానికి లేదా గ్రామానికి (7) ఈశాన్యం నుండి వాయువ్యానికి (8) ఈశాన్యం నుండి ఆగ్నేయానికి కానీ ఇలాంటి ప్రవాహాలున్నా ఈ దోషం కలుగుతుంది.



ఫలితాలు అన్ని గృహాలకు ఒకే తీరున ఉండకపోవచ్చు. నీటి పరిమాణం, ప్రవాహ గతి, గమనాలనుబట్టి గృహానికి/ గ్రామానికి ఉన్న దూరాన్నిబట్టి చెడు ఫలితాల తీవ్రతలో హెచ్చు తగ్గులుంటాయి. గృహానికి/ గ్రామానికి ఇవి అతి సమీపంలో ఉన్నప్పుడు దోష తీవ్రత ఎక్కువగా ఉంటుంది. గృహానికీ, గ్రామానికీ ఈ ప్రవాహాలకు దూరం పెరుగుతున్నకొద్దీ ఈ దోష సాంద్రత తగ్గుతూ ఉంటుంది. అలాగే చెడు ఫలితాల తీవ్రత కూడా తగ్గుతూ పోతుంది.

## వాస్తువార్త


వాస్తువిద్వాన్ సాయిశ్రీ
డా॥ దంతూరి పండరినాథ్
3-2-4, కింగ్స్‌వే, సికింద్రాబాద్- 3
సెల్స్: 9885446501/ 9885449458


### ఎంత సంపాదించినా సరిపోవటం లేదు!?

**వెంకటేశ్వరరావు - ఖమ్మం**

**ప్రశ్న: మా ఇంట్లో ఎంత సంపాదించినా ఆదా అవడం లేదు. మేం ఒక కంపెనీకి సంబంధించిన కాలనీలో ఉంటున్నాం. మాకు వేతనం వచ్చినా సరిపోవటం లేదు. ఎందువల్ల?**

**జవాబు:** కంపెనీ క్వార్టర్స్‌లో నివసించేవాళ్లు ఆ ఇంటిని వాస్తుపరంగా మార్చుకోవటానికి వీలుండదు. ఆ ఇల్లు ఎలా ఉన్నప్పటికీ తూర్పు ఈశాన్యంలో ప్రథమ పూజ అనివార్యం. ఒకవేళ అక్కడ బాత్ రూమ్స్, లెట్రిన్స్ వుంటే ఆ ఇల్లు మారటం తప్ప గత్యంతరం లేదు. వేరే విధమైన వాస్తు దోషాలుంటే ఆ దోషాలనుబట్టి చేసుకోవలసిన ఇతరత్రా ప్రతిష్ఠాపనలు అనుసరించటం వల్ల కూడా మంచి ఫలితాలు ఉంటాయి. ముందు తూర్పు ఈశాన్య పూజ ప్రారంభించండి.

### ప్రత్యామ్నాయం సూచించండి!

**మాధురి - విశాఖ**

**ప్రశ్న: మాది ఏజెన్సీ ప్రాంతం. వాస్తు గురించి తెలుసుకోకుండా ఇల్లు ప్రారంభించాను. ప్రారంభించి అయిదు సంవత్సరాలు అయినా, ఇల్లు కట్టడంలో లోపాలు వున్నాయని మీకు లెటర్ రాస్తున్నాను. తగిన సలహా ఇవ్వగలరు.**

**జవాబు:** గృహారంభానికి శంకుస్థాపన ముహూర్తం, పునాదులు తీసే పద్ధతులు చాలా ముఖ్యమైనవి. అంతేకాక కొన్ని శల్యదోషాలు వున్నప్పటికీ గృహ నిర్మాణానికి ఆటంకం ఏర్పడుతూ ఉండటం, నిర్మాణ క్రమం ఆగిపోవటం మొదలైన దుష్పరిణామాలు కలుగుతాయి. అందువల్ల వీటన్నిటి విషయంలో వాస్తు నిపుణుల సలహా అనుసరించి ప్రారంభించడం మంచిది. ఇప్పుడు మీరు ఉన్న ఇంట్లో నైరుతి వాస్తు దోషముండే అవకాశం ఉంది. మీ ఇంటి ప్లాన్ పంపించలేదు. ఇల్లు చూపించి వాస్తు నిపుణుని సలహా ప్రకారం సవరించుకోవడం మంచిది.

### రేకులతో వరండా నిర్మించవచ్చా?

**రాజశేఖర్ - ఖమ్మం**

**ప్రశ్న: మా ఇంటికి దక్షిణం వీధి ఉంది. దక్షిణం వాలుగా రేకులు వేసి వరండా నిర్మించాలనుకుంటున్నాం. ఎవరు వచ్చినా ముందు వరండాలోనే కూర్చుంటారు. అక్కడే మాట్లాడి పంపించేయవచ్చు. ఇంట్లోవాళ్ల ప్రైవసీకి భంగం కలగదని అనుకుంటున్నాం.**

**జవాబు:** కేవలం దక్షిణ వాలు వరండా మంచిది కాదు. సౌలభ్యం సంగతెలా ఉన్నా వరండావల్ల అనారోగ్య సమస్యలు, అవాంతరాలు ఎదుర్కోవలసి వస్తుంది. ఉత్తరాన కుడి వాలు వరండా ఉన్నప్పుడే ఆ నిష్పత్తిలో దక్షిణ వాలు వరండా కూడా నిర్మించవచ్చు. అలాగే కేవలం పశ్చిమ వాలు వరండా కూడా సరైంది కాదు. తూర్పు వాలు వరండా కూడా ఉన్నప్పుడు సదరు నిష్పత్తిలో పశ్చిమ వాలు వరండా కూడా ఉండవచ్చు. కేవలం పశ్చిమ వాలు వరండా నిర్మించకూడదు. వాలు లేకుండా వరండాలు నిర్మించే పద్ధతులు ఉన్నాయి. అలా నిర్మించుకోవడం వాస్తుకు అభ్యంతరం కాదు. ■

వాస్తువిద్వాన్ డా॥ దంతూరి పండరినాథ్ పాఠకుల సమస్యలకు ఆదివారం 'వాస్తువార్త'లో సమాధానాలిస్తారు. ఈ కింది కూపన్ జతచేసి సమస్యలు పంపవలసిన చిరునామా: సాయిశ్రీ వాస్తు కన్సల్టెన్సీ, 3-2-4, కింగ్స్‌వే, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్-3

వాస్తువార్త

పూర్తి పేరు: ----------------------------------------
పుట్టినతేదీ:-------------------- ఊరు: --------------
జన్మనక్షత్రం:----------తల్లిపేరు:----------------------
చిరునామా: -------------------------------------
------------------- ఫోన్: -----------------------

# పర్సనల్ పాయింట్

చల్లా సుబ్రహ్మణ్యం
1 సి-ఐక్యూ టవర్స్, 3-4-540,
నారాయణగూడ, హైదరాబాద్-27
మొబైల్: 9866362224/ 9553662224
challascounsel@gmail.com
www.challascounsel.com



# అతనికి పిల్లలు వద్దట!

కె.సి - హైదరాబాద్

ప్రశ్న: నా వయసు 26 సంవత్సరాలు. ఒక ప్రైవేట్ కంపెనీలో జాబ్ చేస్తున్నాను. నాకు 20 రోజుల క్రితం పెళ్లి కుదిరింది. అబ్బాయి ఢిల్లీలో జాబ్ చేస్తున్నాడు. మాది పెద్దలు చూసిన సంబంధమే. ఎంగేజ్‌మెంట్‌కి ముహూర్తం పెట్టుకోబోతున్నాం. అబ్బాయి చాలా మంచివాడు. చూడ్డానికి చాలా అందంగా ఉంటాడు. తను మాట్లాడితే అలానే ఎన్ని గంటలైనా వింటూ వుండాలనిపిస్తుంది. చాలా యాక్టివ్ పర్సన్. మా ఎంగేజ్‌మెంట్‌కి చాలా పెద్ద సర్‌ప్రైజ్ ప్లాన్ చేస్తున్నాడని తెలిసింది. నా షాపింగ్ కూడా తనే దగ్గరుండి సెలెక్ట్ చేస్తానన్నాడు. అంతా హ్యాపీగా ఉంది... అనుకునే టైంలో తనొక పెద్ద ట్విస్ట్ ఇచ్చాడు. అదేంటంటే- అతనికి పిల్లలు అసలు వద్దట. మనమిద్దరం హ్యాపీగా ఉంటే ఇక పిల్లల అవసరమేంటి? అని అంటున్నాడు. ఎవరో ఏదో అనుకుంటారని నేను పట్టించుకోను. పిల్లలు లేకుండా మన మ్యారీడ్ లైఫ్‌ని ఎంజాయ్ చేద్దామంటున్నాడు. ఇది విన్న దగ్గర్నుంచీ నాకు నిద్ర పట్టడం లేదు. అన్నీ బాగున్నాయి కానీ తన ఈ ఆలోచనకు కారణమేంటో అర్థం కావడం లేదు. ఒకసారి ధైర్యం చేసి "ఎందుకు అలా అనుకుంటున్నారని" అడిగితే- "నా కారణాలు నాకున్నాయి" అని అన్నాడు. మా అమ్మా-నాన్నలకి ఇంకా ఈ విషయం చెప్పలేదు. ఏం చేయాలో తెలీట్లేదు. మీ దగ్గరకి అతన్ని తీసుకురమ్మంటారా?

జవాబు: ఆలస్యం చేయకుండా తీసుకురామ్మా. ఏవో కారణాల మీద పిల్లలు వద్దు అని.... అనుకోవడం- అందులో తప్పేం లేదు. అయితే ఆ కారణాలు శారీరకమైనవా? మానసికమైనవా? సిద్ధాంతపరమైనవా? ఆధ్యాత్మికమైనవా? ఆర్థికపరమైనవా? అన్నది తెలుసుకోకుండా పెళ్లికి సిద్ధమైతే మాత్రం అది నీ తప్పవుతుంది. ఇంకా ఎంగేజ్‌మెంట్ కూడా అవలేదు కనుక తొందర పడొద్దు. ప్రీ-మేరిటల్ కౌన్సెలింగ్‌లో ఒకరి గురించి ఒకరికి చాలా విషయాలు తెలియజేస్తాను.... రండి.

## తల్లిదండ్రులను శత్రువుల్లా చూస్తుంది....

ఎం.ఎల్ - విశాఖ

ప్రశ్న: మా పాప వయసు 19 సంవత్సరాలు. మాకు ఒక్కతే కూతురు. ఇంటర్ ఫస్టియర్‌లో 78 శాతం మార్కులు వచ్చాయి. సెకండ్ ఇయర్‌లో మూడు సబ్జెక్ట్స్ ఫెయిలయింది. ఇంటర్ ఫస్టియర్ హాలిడేస్ తర్వాత నుంచి తన ప్రవర్తనలో విపరీతమైన మార్పు కనపడుతోంది. అన్నిటికీ కోపం, విసుగు. ఏదైనా చిన్న పని చెప్పినా వెంటనే ఎదురు మాట్లాడుతుంది. తను ఏదైనా అనుకుంటే అది క్షణాల్లో జరిగి తీరాలి. చదువుకోమని చెబితే కోపం. ఏదైనా నేను గట్టిగా మాట్లాడితే "ఇంట్లో నేనుండటం మీకిష్టం లేదు. నన్ను హాస్టల్‌లో వేయండి" అని గట్టిగా అరుస్తుంది. ఫోన్ మాట్లాడ్డం లేదా టీవీ చూడ్డంలో రోజంతా గడిపేస్తుంది. ఇంటర్ రిజల్ట్స్ వచ్చాక ఈ ధోరణికి మరీ పెరిగిపోయింది. ఒక్కతే గదిలో కూర్చుని గంటలు గంటలు గడుపుతుంది. ఏదైనా అంటే తిండి మానేస్తుంది. మమ్మల్ని శత్రువుల్లా చూస్తుంది. తనని అసలు ఏం అనాలో, ఏం అనకూడదో అర్థం కావడం లేదు. అసలేం చేయాలి?

జవాబు: పాప ప్రవర్తనలో ఇంటర్ మొదటి సంవత్సరం పూర్తయ్యాక మార్పు కనిపించినపుడు మీరు తీసుకున్న జాగ్రత్తలు ఏమిటి? పాపని కౌన్సెలర్ దగ్గరకు/సైకాలజిస్ట్ దగ్గరకు కానీ తీసుకువెళ్లాల్సింది. పాప ఉన్న ఈ స్థితికి కారణాలు:

* వయసురీత్యా అమ్మాయిలో వచ్చే హార్మోనల్ మార్పు కావచ్చు.
* ఆమె తీవ్రమైన స్నేహాల ప్రభావం.(ఆడ, మగ ఎవరైనా ఉండొచ్చు)
* ఇంటి వాతావరణం తనకి అనుకూలంగా లేకపోయుండవచ్చు.
* ఇకనైనా ఆలస్యం చేయకుండా పాపను తీసుకుని రండి. వాస్తవాలు తెలుసుకుని తగిన కౌన్సెలింగ్ థెరపీ ప్లాన్ చేద్దాం.

## ఆమె మాటలు మధురం... చేతలు కఠినం...

కె.పి - పెద్దాపురం

ప్రశ్న: నా వయసు 22. ఆమె వయసు 20. కాలేజీలో నా జూనియర్. తనని నేను గాఢంగా ప్రేమిస్తున్నాను. తను కూడా నన్ను ప్రేమిస్తోంది. తన మాటలు చాలా స్వీట్‌గా ఉంటాయి. చేతలు మాత్రం కఠినంగా ఉంటాయి. మాటలకి- చేతలకి ఎందుకింత తేడా?

జవాబు: ఆడపిల్లలు అలానే ఉంటారు బాబూ. ఉండాలి కూడా. మాటల్లో చూపించే మాధుర్యం చేతల్లో కూడా చూపిస్తే బతుకు మధురం కాదు బస్టాండ్ అవుతుందని అమ్మాయిలకు బాగా తెలుసు. ■

# కెరీర్‌ని నిర్ణయించుకోవడానికి సరైన సమయం ఏది?

బి.బి.ఎల్ - గుంటూరు

ప్రశ్న: మా పాప అయిదవ తరగతి ఎగ్జామ్స్ రాసి, 6వ తరగతికి వెళుతుంది. చదువులో 80-85 తెచ్చుకుంటుంది. ఎక్స్‌ట్రా కరికులర్ యాక్టివిటీస్‌లో కూడా పాల్గొంటుంది. తన కెరీర్ ఎలా ప్లాన్ చేసుకోవాలి? ఎప్పుడు ప్లాన్ చేసుకోవాలి? అసలేం గ్రూపు తీసుకుంటే బాగుంటుంది? టెన్త్ క్లాస్ అయ్యాక కెరీర్ కౌన్సెలింగ్ తీసుకోవాలా?

జవాబు: అమ్మాయి అన్నిట్లోనూ బాగానే ఉంది కనుక ప్రత్యేకంగా కెరీర్ కౌన్సెలింగ్ అంటూ ఇప్పుడేమీ వద్దు. అయితే పాప అభిరుచుల్ని గ్రహించి అటు వైపుకి తిప్పి ప్రోత్సహించడం ఇప్పుడు జరగాల్సిన పని. "అభిరుచుల్ని ఎలా గ్రహించాలి?" అది కూడా రాయమని అడగొద్దు. చోటు సరిపోదు. పైగా అభిరుచుల్ని గ్రహించడం ఒక కౌన్సెలర్ ద్వారా జరగాల్సిన పని. ఈ సెలవుల్లో కౌన్సెలర్‌ని కలిసి ఆ పని చేయండి. ■

